శ్రీరస్తు.

# విప్రనారాయణ నాటకము

(ఐదంకముల సాంఘిక నాటకము)


బళ్లారి
గవర్నమెంటు సెకండరి ట్రైనింగుస్కూలు నందు
సహాయోపాధ్యాయుఁడగు,
రూపనగుడి నారాయణరావు చే
రచితము.



బళ్ళారి
రాయలసీమ ముద్రణాలయమున
ముద్రితము.

ప్రకాశకులు
శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల,
బళ్లారి.




(వెల రు. 1.0.0

# పీఠిక



ఆంధ్రపరిషత్తు వారిచేఁ బ్రకటింపఁబడిన మల్లయకవి కృత విప్రనారాయణ చరిత్రమ్మును, ఏతత్ గ్రంథప్రకాశకు లగు బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులు గారును, మల్లాది సూర్యనారాయణ శాస్త్రులు వారును, గలిసి వ్రాసినట్టి దాని పీఠికను, జదువఁగాఁ గొన్ని మార్పులతో నాకథ చక్కని సాంఘిక నాటకము కాఁగలదని నాకుఁ దోఁచెను. ఆసమయమున రాయచోటి యందలి యుద్యోగస్థులగు నామిత్రులు, కొన్ని నాటకముల నాడుచుండి, నన్నొక సాంఘిక నాటకమును వ్రాయఁగోర, నేనీ విప్రనారాయణ నాటకమును రచించి వారి కొసంగితిని. వారీనాటకమును 1919-20 లో రెండుసారు లాయూరఁ బ్రదర్శించిరి. ఈనాటక రచనయందు నాకుఁదోడ్పడుటయె గాక, దేవదేవిపాత్రమును ధరించి రసభావద్యోతికముగా నభినయించిన యాసన్మిత్రునకు, బ్రకృతము బెంగుళూరు 'సేంట్ జోసెఫ్స కాలేజి'లో నాంధ్రోపన్యాసకుఁడుగా నుండు శ్రీయుత విద్వాన్ వెల్లలూరు వేంకటాద్రి శర్మగారికి, నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈ నాటకము మదీయ సోదరోపాధ్యాయుల ప్రోత్సాహమున మావిద్యార్థులచే బళ్లారిలో మఱియొకసారి 1928సం॥ జనవరి నెలలోఁ బ్రదర్శింపఁబడినది. అప్పటినుండి యీగ్రంథమును నాపెట్టెలో నొకమూలఁ బడవైచి యుంటిని. శ్రీకృష్ణ

దేవరాయ గ్రంథమాలవారు తమ గ్రంథమాలలో నొకదానిని గా దీనిని బ్రకటింప నెంచి, సన్నడుగ, నేనందుల కియ్యకొని, యింత వఱకు వ్రాఁతరూపముగనే యుండిన దీనిని బ్రచురణ యోగ్యముగా సంస్కరించి, వారి కొసంగితి.

ఇందలి యితివృత్తము వల్లయకవి కృత విప్రనారాయణ చరిత్రము నే చాలవఱ కనుసరించుచున్నది. అందలి కథాసంవిధానము నాకును సరసమని తోఁచుట వలన నేనట్లు చేసితిని. కాని వైజయంతీవిలాస మందలి భావములను నింపు లేక పోలేదు. తమ్మయ కవి మీఁదలి యభిమానముచే 'వైజయంతీవిలాస' మందలి మూఁడు పద్యముల నట్లనె యుంచియున్నాను. ఏయే గ్రంథముల నుండి నే నెంతెంత గ్రహించినది పాఠకోత్తములు తెలియంగఁగలరు.

తమ కెన్నితొందర లున్నను, దీనికి భూమికను వ్రాసి యిచ్చి, నన్నుగారవించిన దత్తమండల కళాశాలాంధ్ర పండితులగు బ్రహ్మశ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రుల వారికిఁ గృతజ్ఞతాపూర్వకమైన యనేక వందనము లర్పించుచున్నాను.

చదువరు లీ గ్రంథమును జదువుట కుపక్రమించుటకుఁ బూర్వమే యిందంటించి యుండు తప్పొప్పులపట్టికను జూచి యిందలి తప్పులను సవరించు కొన వారిని వేఁడుచున్నాను.

రూపనగుడి నారాయణరావు.

# భూమిక

'విశ్వశ్రేయః కావ్యమ్' ప్రపంచమునకు మేలు కలిగించునదియే కావ్యము. జనులకు సరసరీతిని హితాహితములను దెలియఁజేసి, వారిని కర్తవ్యమునందు సుముఖులను, అకర్తవ్యములయెడ విముఖులను గావించుట కావ్యముయొక్క ప్రయోజనము. 'సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే' అని మమ్మటాచార్యులు వచించిన విధమున నిరతిశయమై బ్రహ్మానందసహోదరమైన యానంద మొదవించుటయే కాక, సవినయ విశయంబున వాచ్యముగ 'ఇదమిత్థ' మని నుడువక గూఢ వ్యంగ్యవైభవమున జనుల హృదయములను రసార్ద్రములను గావించి, కర్తవ్యాకర్తవ్యముల నుపదేశించుట కావ్యము యొక్క పరమప్రయోజనము. ఆదికావ్యమగు శ్రీమద్రామాయణము ఒక్కవిషయమైనను కంఠోక్తముగాఁ జెప్పకయే-శ్రీరామునివలె పితృవాక్యనిరతులై, భరతునివలె భ్రాతృభక్తిభరితులై, లక్ష్మణునివలె సౌభ్రాత్రశోభితులై, సీతవలె పత్యేకతానజీవితలై, హనుమంతునివలె స్వామికార్యతత్పరులై, మనవలయునను మున్నగు భావముల నన్నిటినీ శ్రోతల యుల్లముల వెదచల్లుచున్నది కదా. రసోల్లసితము లయ్యును సదుపదేశ రహితములగు కావ్యము లసత్కావ్యము లనియు, అట్టి వానిం జదువరాదనియుఁ బ్రాచీనులు, 'కావ్యాలాపాంశ్చ వర్జయే' త్తని శాసించిరి. ఉత్తమభావముల నలవడఁ జేయుట

ఘము నాటకములను మన మేల యాడఁగూడదు?'—'అట్టి సాంఘిక నాటకమును బ్రదర్శింపఁ దలపెట్టియే నిన్నటకు రాఁబిలిచినది'-అను నటీ సూత్రధారుల సంభాషణయే తెలుపుచున్నది.

ఈ విప్రనారాయణ నాటకము సాంఘిక నాటకమని కవి యీ వాక్యమునఁ జెప్పియున్నాఁడు. ఇందలి యితివృత్తము (Subject-matter) పన్నిద్దరాళ్వారులలో నొకఁడగు తొండరడిప్పొడియాళ్వారు చరిత్రము. అళియ రామరాజు మేనల్లుఁడగు తిమ్మభూపాలుఁడు పరమయోగి విలాసమునందు మూఁడవయాశ్వాసమున నీచరిత్రమును వ్రాసియున్నాఁడు. చెదలువాడ మల్లయకవి 'విప్రనారాయణ చరిత్ర' మను పేరను సారంగు తమ్మయకవి 'వైజయంతీ విలాస' మను పేరను దీనినే శృంగార ప్రబంధములుగ రచించిరి. మఱియు—

యత్స్యాదనుచితం వస్తు నాయకస్య రసస్య వా ।
విరుద్ధం తత్పరిత్యాజ్య మన్యథా వా ప్రకల్పయేత్ ।

అని సాహిత్యదర్పణమందుఁ జెప్పిన ప్రకారము నాయకోత్కర్షమునకును రసపోషణమునకును నై కథను గొంతవఱకు మార్చియున్నాఁడు. అందు దేవదేవి వేశ్యావృత్తియందలి దోషముల నారసి యద్దాని రోసి, భాగవతోత్తముఁడగు విప్రనారాయణుని వివాహమగుట ముఖ్యమైనది. ప్రబంధకవులు దేవదేవి మధురవాణితోఁ బన్నిదము చఱచి భక్తాగ్రగణ్యుఁడగు విప్రనారాయణుని విటపుంగవుని గావించినట్లు వ్రాసిరి.

నాటక సంప్రదాయమును బట్టి యుండు శృంగారము ప్రధానరసమైనను, భక్తిరూపము నొందిన శాంతరసమును వెల్లి విరియుచున్నది. అయ్యాయిసందర్భముల కరుణహాస్యాది రసములును పొందు పడి యున్నవి. నిర్వహణమునం దద్భుత రస మందము గూర్చుచున్నది. రంగకల్పనము మున్నగువానిచే నీ నాటకము ఆంగ్లేయ పద్ధతిని గొంతవఱ కనుకరించినను, ఇందు ముఖాది సంధులు మనోహరముగ ననుసంధింపఁబడియున్నవి. 'కావ్యార్థసూచనం ప్రస్తావనాంద్యామేవ ప్రకల్ప్యతే' యనునాలంకారిక మతమున కనుగుణముగ, ఈనాటకమున నాందీపద్యమునందే 'ఆర్తరక్షాకేళీ చతురుండు, చిత్రకార్యకరణోత్సాహులత్ప్రభావాఢ్యుఁడు, నారాయణుండు' మున్నగు పదములచేఁ గావ్యార్థము చక్కఁగఁ సూచింపఁబడు చున్నది.

ఇందు ముఖ్యములైన పాత్రములైదు.

నాయకుఁడు పృథుచిత్తుఁడు; దయార్ద్రహృదయుఁడు; సహజవైరాగ్యసంపన్నుఁడు; పరమభాగవతోత్తముఁడు; ధీరోదాత్త లక్షణ లక్షితుఁడు. కనుకనే నాయిక పెద్దకాలము ప్రయత్నించియు నాతనిమనస్సును కలంచలేక పోయెను. దైవవశమున, గాలివాన సాయమున లబ్ధాంతరయై నిజకళాకౌశలము మెఱయించి యామవానీయుని చిత్తము నెట్టకేలకాత్మాయత్తము గావించెను.

నాయిక ప్రౌఢ; చతుర; లలితకళాకుశల; ముకురదర్శనమహాశాస్త్రనైపుణ్యగౌరవమున్న నెఱజాణతనమును నేర్చినది.

ఇట్టి నైపుణ్యము వేశ్యాసహవాసముచేఁ జిన్నతనముననే పట్టు వడియుండనోపును. కాని-తిమ్మనమస్కృతు లందుకొన నందులకు-మధురవాణి యంతనినిజతే ప్రియుఁడని యగ్గించుచుండ,- తాను భక్తిభావసంశోఁ బరిణయమాఁడ నెంచిన భాగవతోత్తముని- "ఇటువంటి యయ్యలె చిటుకుమనక యుండి చీఁకటిపడఁగానే వనవాటిక విడిచి విటులై కుంటకుటిలాలకల కుటీరంబులు చేరి వారికాలిలత్తుక నామనిటలంబులంటు వారి పాదనికటంబున వసించువారు" అని చులుకఁజేయుట యుంచుక యౌచిత్యభంగ కరమని నాతలంపు. ప్రబంధములందు ప్రతిభంగ మొదవించి విప్రనారాయణుని విటుని గావించుటయే వర్ణ్యముకావున-

మ. గ్రయః:—"నామములు దీర్చి తులసీ
దామంబులు వైచి చేల తెరముసుఁగు నగునీ
సాములె కారా మగువల
బాములఁబడువారు వేషభాషలు గుఱుతే" అనియు

తమ్మయ:—"ఇటువంటయ్యలె కారా
చిటుకు మనక యుండ సంజచీఁకటి వేళ౯
ఘటచేటీవిటులై యి
క్కట్టుకంబునఁ దిరుగువారు కంజదళాక్షా" అనియు

వర్ణించుట యౌచిత్యభంగకరము కాక తత్పోషకమే యగు చున్నది.

విటకంటకి పాత్రము మిగుల స్వాభావికముగఁ జిత్రింపఁ బడినది.

మధురవాణి పాత్రమునందు సోదరీప్రేమము, సమయోచితబుద్ధి, సహనము; వేశ్యావృత్తియందే జుగుప్స, మున్నగు సద్గుణములు మనోహరముగ సూచితములైనవి.

ప్రేమపూరితపాత్రమునందుఁ గల్గిన భావసంఘర్షణము లతిహృద్యములు; అనుభవసిద్ధములు. ఇతర చక్కని పాత్రములును గడు మనోహరముగఁ బోషింపఁబడినవి. దేవాలయమునందలి యర్చకుల సంభాషణము, కొలువుకూటమునందు అభియోగవిచారణము మున్నగు ఘట్టములు మిక్కిలి స్వాభావికములు. అభియోగసందర్భమున నేఁటికాలపుఁ బరిస్థితులును గొన్నియాదికింపఁబడినవి.

ఈ కవి తనభావముల ననేకములను మూలగ్రంథముల నుండి కైకొనెననుటకు తిమ్మయకవి పద్యమొకండు రెండట్లు కూర్చుటయేకాక, ఈక్రింది మల్లయకవి పద్యముల సామ్యమును నిదర్శనములు.

సీ॥ తెలిమించు మడుఁగు లింగులు వాఁగట్టక
కాషాయములు దాల్పఁ గాఁగనేమి,
నెలవంక తొగుమణి నీఱుగాఁ దీర్పక
పెనుపటినామముల్ వెట్టనేమి,

# VIII

దాల్పనేమి యింతేసు మహాతాపసుండు
గాకయున్నఁ జేయునె యిట్టి కష్టకృతులు. విప్ర-నాటకము

సీ॥ మొదిచి మెత్తినమృగీ మదపంక మాయెను
మడవలుగట్టఁ బైఁబడినరొంపి
తాపసబాంధవుఁ దగుగంపుపిండియయ్యెఁ
బాఁదులుద్రవ్వఁ బైఁ బడిన దుమ్ము
నిండారుగుల్కు పన్నీటి సొంపులయ్యె
బడలికచేఁ గానఁ బడిన చెమట
కంతుకేళిని గచాకచిఁ బెనంగుటయయ్యె
పడఁ జొరవల్చాఁచెఁ జిక్కుపడినకురులు-మున్నియు.

సీ॥ మొదిచి మెత్తిన సంకుమదపంక మాయెను
మడవలు గట్టఁ బైఁ బడిన బురద
కమ్మతావుల సీను గంధచూర్ణంబయ్యెఁ
బాఁదులు ద్రవ్వఁ బైఁ బడిన దుమ్ము
వలి ఘుంచు పన్నీరు చిలుకరించుట యాయె
వలపుచే మేనున గలుగు చెమట
కస్తూరికాపరాగంబు చల్లుట యాయె
గంపల మోయఁ బైఁగారు నెయువు. విప్ర-నాట

ఇట్టివి కొన్నియున్నను మనోహరములయిన స్వతంత్ర కల్పనలును కొన్ని ము[illegible]లు గుల్కుచున్నవి. ఉదా:

ఆ॥ వె॥ వాన కాఱ్ఁ బట్టి [illegible] కెక్కఁగావచ్చు;
జలదపంక్తి మీఁదఁ జెలఁగ వచ్చు;
ఇంద్రచాప మెత్తి యెక్కిడ వచ్చు; నీ
విరసి మనసుఁ ద్రిప్పఁ దరముగాదు.

తే॥ గీ॥ ఆకసముఁ గ్రమ్ముకొని యున్న యలసి తాభ్ర
శకలచయముల వింతరచనలఁ గనుము
విష్ణుపదమును జేరంగ వేయఁ బడిన
యమృత శిలల సోపానమో యనఁగ వెలయు.

సంస్కృత నాటకములందు ప్రాకృతమువలె ఈనాటకమున నొండు రెండెడల పొడసూపు గ్రామ్య భాషయు పాత్రానుకూలమై ఆయాఘట్టముల కుచిత సౌందర్యమును గూర్చుచున్నది. ఉదా: తోఁట మాలి సంభాషణము. ఒకటి రెండు తావుల శ్లేషచమత్కృతియు హృద్యముగఁ గూర్పఁబడి యున్నది. రచన స్వభావసుకుమారమై కదళీపాకమున

నొప్పారు చున్నది. ఇక్కొక్కొక్కటికి యానము నుగ్గడించినచో 'చలిదికంటె, ఊరుగాయ ఘన' మన్నట్లగునని భయపడు చున్నాను.

పరిణయ కథామంజరి మున్నగు గ్రంథములను రచించి శ్రీనారాయణరావు గారాంధ్ర ప్రపంచమునకు చిరపరిచితులై యున్నారు. అట్టివారి రచనలఁ గూర్చి యెక్కువ వ్రాయనక్కఱ యుండదు. శ్రీ నారాయణ రావు గారింక నిట్టి సరస కావ్యములనెన్నిటిని రచియించి యాంధ్రలోకము నలరింతురు గాక.

ఇట్లు విద్వజ్జన విధేయుడు

శ్రీముఖ చైత్రపూర్ణిమ,
అనంతపురము.

ప్రయాగ వేంకటరామ శాస్త్రి,
[illegible]మండల కళాశాలాంధ్రోపాధ్యాయుఁడు.

# స్మరణ చిహ్నము



(సీసమాలిక)

తనకాలమునకు మించిన భావముల కల్మి
నందఱ కుద్బోధ మమరఁ జేసె,
స్వజనోద్ధరణ కాంక్ష గజబిజింపఁగ బంధు
తతికి సన్మార్గప్రదర్శి యయ్యె,
కడప 'డెప్యూటి కలెక్ట' రయి యుండిన తఱిఁ
బండిత సభల నొప్పంగ జరిపె,
గీర్వాణవాణి కింగ్లీషు మేల్ గ్రంథంబు
లను రెంటిని బరివర్తనము సలిపె;
తనదు మేనల్లుఁ డౌటను నన్ను వత్సల
త్వము మీఱ నెంతో యాదరణఁ జూచె,
ఎనుఁబది రెండేండ్లు చనఁగ విరోధికృ
ద్వర్షమునఁ దనదు పండువాఱి

నట్టి తనువును ద్యజియించి నాకమునకుఁ
బోయె నితఁడాహా నూత్రి సుబ్బాయసూత్రి
యాంధ్రీకముల సంస్మరణ చిహ్నంబుగాఁగ
దృశ్యముఁగ విప్రచరిత రచించినాఁడ.

# ఈనాటకమున వచ్చు పాత్రములు

## పురుషులు

విప్రనారాయణుఁడు- కథానాయకుఁడు.

ప్రేమసారుఁడు-మదనమోహనుల మిత్రుఁడు.

మదనుఁడు, మోహనుఁడు } విటులు. ప్రేమసారుని మిత్రులు.

రంగనాథుఁడు-బాలుఁడు.

తిరువేంకటాచార్యుఁడు, గండభేరుండాచార్యుఁడు, తాతాచార్యుఁడు } అర్చకులు.

రాజు.

మంత్రి.

లేఖకుఁడు.

లక్ష్మణాచార్యుఁడు-ఆలయ ముద్రకర్త.

రంగాచార్యుఁడు-ఆలయ ధర్మకర్త.

దర్పసారుఁడు-ఆరక్షకాధికారి.

తోఁటకాఁపు.

## స్త్రీలు

దేవదేవి-కథానాయిక.

మధురవాణి-దేవదేవిఅక్క.

విటకంటకి- దేవదేవీ మధురవాణుల పెంపుడుతల్లి.

సానిపడుచు.

దాసి.

వీరుగాక మేళగాండ్రు, నంబులు, భక్తాదులు, భటులు, వత్తురు.

స్థలము:—మధుర, శ్రీరంగము, కంచి, కంచికిని శ్రీరంగమునకును నడుమ దారిలో నుండు నొకతోఁట దగ్గరి గుడిసె.

శ్రీరస్తు.

# విప్రనారాయణ నాటకము



## నాంది.

శ్రీకల్యాణగుణార్ణవుండు సుజనక్షేమంకరుం డాత్తర
క్షాకేళీచతురుండు భక్తదురితక్షాళుండు యోగీశ్వరా
నీకస్తుత్యుఁడు చిత్రకార్యకరణోజ్జ్వలత్ ప్రభావాఢ్యుఁడ
స్తోకశ్రీలనొసంగి యర్థిమెయిఁ బ్రోచుంగాక నారాయణుఁడు.

సూత్రధారుఁడు:-(నాంద్యంతమున) అతి విస్తరము వలదు. సభాస్తారులొక సాంఘికనాటకము నాడ నన్నుఁగోర, నేను విప్రనారాయణ నాటకము చేత వీరిని సేవింపఁ గుతూహల పడినాడను. తోడులేక యీ మహాకార్యము సాగించుట కష్టముగావున, నాగృహిణి తోడ్పాటుపడసెద.

(తెరవంకఁదిరిగి) ఓసీ! ఇటురమ్మా. ఓసీ! ఇటురమ్ము.

ఓసీ-పిలిచి నంతనే పనియేమి యనివచ్చు గృహిణి యివ్వా డేల యాలస్యము చేయుచున్నదో! ప్రేమసీ-ప్రేమసీ-ఓసీ-

నటి:- (ప్రవేశము) ఆర్యా! వచ్చితి. నాయాలస్యమునకై నన్ను క్షమింపుము.

సూత్ర:-క్షమించుటకేమి కాని యేల యాలసించితివి ?

నటి:- ఒకవితంతువు తనస్త్రీశిశుద్వయమును మన పొరుగింటి వేశ్యకు విక్రయించెను. అదిచూచుచు మేడపైనుంటిని. ఆర్యా! ఆతల్లి యెంత దయమాలినది! ఎట్టి నీచవృత్తి నభివృద్ధి చేయుటకై తనచిన్నారి శిశువుల నర్పించినది! ఇట్టి సాంఘికాచారములు దుష్టములని ప్రబోధించు నాటకములను మనమేల యాడఁగూడదు ?

సూత్ర:-ఇట్టిసాంఘికనాటకమును బ్రయోగింపఁ దలపెట్టియే నిన్నిటకు రాఁ బిలిచినది.

నటి:-మీరు ప్రయోగింప నెంచిన దేనాటకము ?

సూత్ర:-విప్రనారాయణ నాటకము.

నటి:-సరిసరి! ఈకథ యేమినీతిని బోధించును! ఇట్టి నీతి మాలిన కథలను నాటకములుగా రచించి యాడుట లోకమునకు దుర్నీతులు బోధించుట యగును.

సూత్ర:-నీ వీనాటకమును జదివి యున్నావా ?

నటి:-మూఁడు నాలుగు గ్రంథము లందీ విప్రనారాయణ కథను జదివియున్నాను. ఈకథలో విష్ణుభక్తుఁడగు విప్రనారాయణుఁడు విటశిరోమణి యైనాఁడు. ఇది యెట్టినీతి!

సూత్ర:-ఓసీ! ప్రబంధము లందలి యీకథను జదివినావు కాని యీ నాటక కథాసంవిధానమును నీ వెఱుంగవు. విష్ణుభక్తుఁడై యున్నంత మాత్రమునఁ బ్రాప్తవయస్కుఁడైన బ్రహ్మచారికి పరిణయమాడఁగూడదా ?

నటి:- వెలయాలినా యిల్లాలిఁగాఁ జేసికొనుట?

సూత్ర:- బ్రాహ్మణుఁడు చతుర్వర్ణములలోఁ బెండ్లి చేసికొన వచ్చునని పూర్వులగు నార్యులు చెప్పిరి. అది పూర్వుల మాట. మనయిప్పటి పరిస్థితుల కది సరిపడదు. పరే. అది యటుండనీ. విప్రనారాయణుఁడు వివాహమాడిన దేవదేవి వేశ్యకులజ గాక బ్రాహ్మణకుల సంజాతయె.

నటి:-(తనలో) పెక్కుమార్పులు చేయఁబడి యీ కథ రూపకముగా రచింపఁబడి యుండును. ఆమార్పులు సముచితములో యనుచితములో! తినఁబోయి రుచియడుగనేల?

(ప్రకాశముగ) ఆర్యా! నాటక కర్తయెవరు?

సూత్ర:- సీ. తనదు జీవనయాత్ర ధర్మాస్థ నడపిన
నరసింగరాయఁడే నరసుతండ్రి
హానొన్నరు సుబ్రాయ సోదరి కరుణార్ద్ర)
హృదయ యాసీతమ్మ యెవనితల్లి
అనుకూలవతి లక్షణాన్విత గౌరాంబ
వరభక్తిశీల యెవ్వానిజాయ
ద్రవ్యార్జనంబునఁ దనియయ్యుఁ బుణ్యార్జ
నమునందు మున్నయై యమరువృత్తి

గీ. కొద్ది, యట్టియుపాధ్యాయవృత్తిఁ బూని
విమలగతి లోకయాత్ర గావించువాఁడు
హారితగోత్రుండు నారాయణాహ్వయుండు
కర్తయె యొప్పు నిన్నాటకమున కబల!

నటి:–ఈ విప్రనారాయణ నాటకమునె యాడుదము. ఇంకఁ గాలవిలంబము చేయనేల ?

సూత్ర:– ఈవసంతఋతువును వర్ణించుము.

నటి:– సీ. హరితాంకురాంబర నారామరమఁ జేరి
యామనిరాజు దానడరుచుండ,
నవపుష్పయౌవన నవమాలికను బొంది
యెలమావిగున్న దానలరుచుండ,
తలిరుజొంపములందుఁ బులుఁగుఁగొమ్మలఁగూడఁ
బుంస్కోకిలంబు లింపుగను బాడ,
శాద్వల తలముల సంచరించుచు మృగీ
మృగములు గవగూడి యెసఁగుచుండ,
గీ. అఖిలభూతంబు లిట్లు భోగానుభవము
నందుటనుగాంచి తమలోన నదటు పుట్టఁ
బ్రాప్తయౌవనుల్ బ్రహ్మచర్యంబుమాని
దారగ్రహణంబు సేయంగఁ దమకపడిరి.

సూత్ర:–నీ సంగీతము మిగుల మధురమై యుల్లసిల్లుచున్నది. మఱియుఁ బ్రస్తుతార్థంబును సూచించుచున్నది.

(తెరవంకఁజూచి)అదే! చూడు. దేవదేవిమధురవాణుల పాటకచేరికిఁ బోయి, వారి సంగీతమును వినివచ్చుచున్న వారీ మదనమోహనులు వీరావెలఁదుల విషయమై యేమి చెప్పుకొను చున్నారో విందము రమ్ము. (నిష్క్రమింతురు.)

శ్రీరస్తు.

# విప్రనారాయణ నాటకము



## ప్రథమాంకము.

### రంగము 1. మధురయందలి యొకవీధి.

(ప్రవేశము: మదనుఁడు, మోహనుఁడు.)

మద:-మిత్రమా! మోహనా! ఏమి యీ గానప్రావీణ్యము! ఆవీణారమణీయ మృదుమధుర నిక్వాణవిభవము! సభాసదులు సమధికసమ్మదాశ్చర్యవశీభావస్వాంతులై చిత్రపటముల యాకృతి నుండిరి.

కం. కలకంఠంబుల నలసను
సలలితముగ నేర్పునట్టి సద్విద్యను పే
ర్మిలఁ బలికింపంగల యీ
జిలిబిలి యెలుఁగమ్మాతభంగఁ జెన్నలరుఁజుమీ.

మోహ:-ఆభోగినుల రూపరేఖావిలాసములుగూడ వారివిద్యానైపుణ్యమున కనురూపముగా నున్నవి.

మద:-వారిసౌందర్యమును వారి గానకళాప్రావీణ్యము వలె ననన్య సాధారణము.

మోహ:-గాంధర్వ విద్యయందు వారి కెనయగువారీ మధురా నగరంబున నెవ్వరును లేరనుట నిజము. వారట్టివారు కాఁబట్టియె మనబహుళార్థగుప్తుఁడు తనకొమారుని పుట్టిన దినము మహోత్సవమునకై యీవారవనిత లను గాంచీనగరము నుండి రప్పించెను.

మద:-కేవలము తన కుమారుని పుట్టినదినము మహోత్సవ మునకై బహుళార్థగుప్తుఁడీ వారాంగనల నింత దూరము రావించెనని తలంచుచున్నావా యేమి?

మోహ:-మనకేమిటి విషయమైనాఁకుఁ దెలియక పోలేదు లే. అతఁడు కేవలము వారవనితా శృంగారసాంగత్య పరా యణుఁడు.

మదనా!

సీ. పూర్వసంపద నేను గోల్పోవకున్నఁ
గలధనంబంతయును జూఅగా వ్యయించి
మించుఁబోండ్ల కౌఁగిళ్ల వసించియుందు;
ఇపుడు వారిపొందును గాంచు టెవ్విధంబు?

మద:-మనకొక్కకాసైనను వ్యయముగాకుండ వారిపొందు గలుగు నుపాయం బొకటియున్నది.

మోహ:-ఏమియుపాయము?

మద:-తన తండ్రియుండినప్పుడెంతో నిర్బంధమున నుండినప్రేమ సారుఁ, డిటీవలఁ దండ్రిగతించినది మొదలు కొంచెము

మనతోఁ గలసిమెలసి యున్నాఁడుగదా. వీనినుపాయము న మనవలలో వేసికొని కదులోభియయిన వాని తండ్రి యార్జించి పెట్టిన ధనమునకు వ్యయము గల్పించిన నన్ని కార్యములు చక్కఁబడును.

మోహ:-దేవదేవీమధురవాణులలో నొక్కతతోనైనఁ బ్రేమసారునకుఁ దగులము గలిగింప వలయును.

మద:-అదియే నా యోజన. అట్లుచేసిన నొక్క క్రియతో ఫలద్వయమును సాధించిన వారమగుదుము.

మోహ:-ఫలద్వయ మేమి?

మద:-దేవదేవీ మధురవాణులు మనకు వశ్యలగుటయేగాక, తనశిష్యుఁడు మహానీతిపరుఁడని మమ్ములఁ జులకనగఁ జూచు ప్రేమసారుని గురువునకుఁగూడ గర్వభంగమగును.

మోహ:-మదనా! మేలు; మేలు. అట్లయిన, ఈవేశ్యల విడిదికెప్పుడు ప్రేమసారుని దోడ్కొని పోవుదము?

మద:-ఈరాత్రివారలు బహుళార్థగుప్తునింటను నిలిచెదరఁట.

మోహ:-వారలు తమవిడిది యుందుండుట ముందుగా నెఱిగి పిదపఁ బ్రేమసారుని నక్కడకుఁ దోడ్కొని పోవలెను.

మద:-కానీ చూతము. రేపురాత్రియైన ననుకూలపడకపోవునా?

(నిష్క్రమింతురు)

రంగము 2. మధురలో మఱియొక వీధి.

మదనుఁడు:-

ఉ. అన్ననఁ గెంపు పల్లవుల నందమునుం బగు మేనుఁదీవ యా
చెన్నలరారు తళ్కుమెఱుంగులు లా నికువాలుఁగన్ను లా
వన్నెల ముద్దుమోము చెలువంబును గన్నులఁగట్టినట్టు లా
చున్నవి; యింతిచక్కఁదనమో ననవిల్తునిగారడమ్మొకో!

మోహనుఁడేల యాలసించుచున్నాఁడో!

(ప్రవేశము: మోహనుఁడు)

మోహనా! ప్రేమసారుఁడెక్కడ?

మోహ:-వాఁడింటలేఁడు. గురువుగారియింటికిఁబోయినాఁడఁట.

మద:-అవును. వాఁడు నాటకాలంకారాదికములఁ జదువుచున్నట్లు నాతోఁ జెప్పియున్నాఁడు. శృంగార రసముపై నభిరుచి యతని కుంచినది కాఁబోలు; రాత్రియింత ప్రొద్దయినను నింటికి మరలకున్నాఁడు. వానిచదువు కూడ మనకార్యసాధనమున కనుకూలమె.

మోహ:- అదెట్లు?

మద:-శృంగార రసపానము మన్మథతాపోద్రేక కారణము.

మోహ:-అదిగో! పుస్తకము చేతఁబట్టుకొని ప్రేమసారుఁడిటు వచ్చుచున్నాఁడు.

(ప్రవేశము: ప్రేమసారుఁడు పుస్తకముచేతఁబట్టుకొని)

మిత్రమా! ఇంతాలస్యముగ నింటికిఁ బోవుచున్నావేల?

ప్రేమ:-గురువులవారియొద్దఁ జదువుచుంటిని. ఆలస్యమైనది. ఇంతప్రొద్దు మీరిక్కడకు వచ్చితిరి?

మద:- నీనిమిత్తమే వచ్చియున్నాము. నీభోజన మైనదా?

ప్రేమ:-నేఁడు కొంచెము మునుకడనే భోజనము చేసికొని గురువుల వారి యింటికిఁ బోతిని.

మోహ:-ప్రేమనాథా! నిన్నరాత్రి బహుళార్థగుప్తునింట జరిగిన గానసభకు వచ్చియుంటివా?

ప్రేమ:-నేను రావలెనని యుంటినిగాని గురువుల వారందుల కవకాశమీయలేదు.

మద:-వీనులున్న ఫలమున కావారాంగనల సంగీతము వినితీర వలెను; కన్నులున్న ఫలమునకు వారి లావణ్య విలాస ములఁ జూచితీరవలెను.

కం. ఆరూపం బాచెలువం
బారేఖావిభ్రమంబు లామృదుగానం
బారమ్యనృత్యవిభవం
బేరామలయందుఁ గాంచియెఱుఁగమమిత్రా!

ప్రేమ:-వారిగానమాధుర్యము వారివీణాప్రావీణ్యము వారి లాస్యవైభవము కనుహృదయాహ్లాదకరముగా నుండెనని జను లనుకొను చుండఁగా వింటిని.

మద:- సంగీతాభిజ్ఞుఁడవు నీవే వారి నైపుణ్యముం జూడక పోతివే!

ప్రేమ:- ఇంకొకసారి గానసభ జరిగినప్పుడు తప్పక వచ్చెదను.

మద:-ఆ వారాంగనలు రేపే తమ యూరికిఁ గంచికిఁ బ్రయాణమగుదురఁట. వారి విడిది యిక్కడకు సమీపముననే యున్నది. ఇప్లే యక్కడకుఁ బోయి వీనులకు విందొనరింతము. పోదము రమ్ము.

ప్రేమ:- గీ. విత్తరహిత భుజంగుల వెడల నడిచి
విత్తయుతులకు శీలంబు విక్రయించి
వలపు నటియించి కపటంపుఁ జెలిమి పెంచి
విత్తము హరించి పంపు టీ వేశ్యవృత్తి.

అట్టి వేశ్యలగృహంబు చేరవచ్చునా? ఇందున రాత్రివేళ!

మోహ:- దురుద్దేశమునఁ గాదుగదా మనమందుఁబోవుట. సంగీతము విన్న వెంటనె మరలుదము.

ప్రేమ:- అయస్కాంత సాన్నిధ్యమున సూచికలవలె విద్యుల్లతాంగుల సాన్నిధ్యమునఁ బురుషుల హృదయంబు లల్లలనాడును. కావునఁ గాంతాశక్తులము గాకుండ మనము దవు దవ్వుల నుండు టుచితము.

మోహ:- ధైర్యప్రేరణమునఁ దదాకర్షణశక్తిని బాపవచ్చును.

మద:- ప్రేమసారా! భయపడవలదు. అన్నిటికిని మేమున్నాము. పోదము రమ్ము. (చెయిలాగుకొని నడుచును.) ఇదే వారివిడిది.

మోహ:- అదేవిను సంగీతము వినవచ్చుచున్నది.

(లోపల సంగీతము)

ప్రేమ:- సంగీత మిక్కుడకు స్ఫుటముగా వినవచ్చుచున్నది. లోనికిఁ బోనేల ? ఇందుండియే విందము.

మద:- ఆవనితల వదనంబులు సూచుచు వారినోటినుండి వెడలు గానంబు వినుట లెస్స.

గీ. కనులు దిలకింప వీనులు వినుచునుండఁ
జిత్తమునఁ గల్గుభావమే శ్రేష్ఠతరము;
అట్లుగాక శేషేంద్రియములఁ గలుగు
జ్ఞానమల్పమ్ము నప్రశస్తమ్ము సుమ్ము.

కావున లోనికిఁబోయి తీరవలెను. ప్రేమసారా! రారమ్ము.

(ప్రేమసారుని ముందుకుఁ ద్రోయును.)

ప్రేమ:- ఎప్పుడును గణికల గృహంబు ప్రవేశించి యెఱుంగ. మీరే ముందుఁజనుఁడు. నేను మీ వెంటవత్తును.

మద:—నీ వండగాఁడవు; స్థితిమంతుఁడవు. నీవే ముందుండవలెను.

(ప్రవేశము: విటకంటకి తలుపుతీసికొని)

విట:-ఎవరో తలవాకిట మసలుచున్నవారు. (మదనమోహన ప్రేమసారులంజూచి) అయ్యలారా! లోనికి వేంచేయుఁడు. (యువనిక యెత్తఁబడును. దేవదేవి మధురవాణీ ప్రభృతులు గూర్చుండి యుందురు. దేవదేవి పాడుచుండును. మదన మోహన ప్రేమసారులంగాంచి దేవదేవీ మధురవాణులు లేచి కేల్మోగిచి మ్రొక్కుదురు. వచ్చినవారు గూర్చున్న తరువాత దేవదేవీ మధురవాణులును విటకంటకియుఁ గూర్చుందురు.)

(గేయము)

(హిందూస్థానికాపి రాగము-ఆదితాళము)

దేవ:- వరదా! రమామనోబ్జ భృంగ। ప।
విరచిత వివిధ భవభంగ॥ అ॥
దురితదవానల। శరనిభ।
మురాది। సురారి। విరోధి। విదళన॥ ౧.
వరమునిప్రాంగణ। సురద్రుమ।
సురార్చి। తపాద। సరోజ। విలసిత॥ ౨.
ధృతగిరి మందర। నుతబల
శ్రితా ర్త। వితాన। నతా! మహితదయ॥ ౩.

మద:- ప్రేమసారా! నీవు సంగీతాభిజ్ఞుడవు. నీకభీష్టమైన రాగమునఁ బాడుమనుము.

ప్రేమ:- కమాజు.

(గేయము)

(కమాజురాగము-ఆదితాళము)

దేవ:- శ్రీయదుకులజలనిధి సోమా।
త్రిజగదభయకర॥ ప॥
యోగిహృదయగృహా! భోగిమృదుశయన।
భాగగనదిశా। భోగిసితయశా॥ అ॥
సురనికరవినుత సురుచిర మృదుపదకమల। దేవ।
శ్రీనయనచకోరసుఖదసుధాంశుబింబ॥

కనకకశిపు తను। విదళననిపుణ।
గజేంద్రముఖ శరణాగత। భయహారణ॥

మోహ:- కడు హృదయంగమముగా నున్నది.

విట:- స్వామీ! నేనెంతో కష్టపడి మిక్కుటమగు ధనము వెచ్చించి వీరికీ గాంధర్వవిద్య నేర్పించితిని. (మధురవాణింజూచి) మధురవాణీ! నీవింతపాడుము. ఈయయ్యగార్లు సంగీతము తెలిసినవారలు. తెలిసినవారిని మెప్పించినఁ గీర్తి లాభములు గలుగును.

మధు:- (ముందరికివచ్చి కూర్చుండి విటకంటకిం జూచి) ఏ రాగమునఁ బాడవలెను?

పేమ:- దేవగాంధారి.

(గేయము)

(దేవగాంధారిరాగము-ఆదితాళము)

మధు:- భజియింపుమా మనస॥ ప॥

వనజనాభుని। వరకృపాభాసు।
వనజవిలసితాంగుఁ। బక్షిరాట్తురంగు॥ అ॥
భక్తపాలుని। ధర్మశీలుని।
భాగ్యప్రదునిహరినిఁ। బన్నగశయనునిన్॥ ౧.
సారసాక్షుని। సర్వసాక్షిని।
సామ్యమానిహృదయ। సద్మనివాసునిన్॥ ౨.
నందవంశజ। నందనాగ్రణి।
వందితామరేంద్రు। మందరగిరిధరున్॥ 3.

మద:- వహ్వా! వహ్వా! చిక్కులి బాగున్నది.
విట:- స్వామీ! ఈచిన్నది గానముచేత ననేకవసుంధరాధిపతుల మెప్పించి నానారత్నమయభూషణాంబరముల బహుమానంబుగాఁ గొన్నది.
ప్రేమ:- బహుళార్థగుప్తుఁడు మిమ్మెట్లు బహూకరించెను?
విట:- వేయినూట పదారుమాడలు మాకిచ్చుటయేగాక, మధురవాణి చేతులం దాకనకకంకణములను బహుళార్థ గుప్తయ్య స్వయముగాఁ దొడిగెను.
మద, మోహ:- ఏవీ! చూతము. (మధురవాణి హస్తముంబట్టుకొని మదనమోహనులు కంకణముం జూచుచు స్పర్శసుఖము ననుభవింతురు.)
విట:- (దేవదేవింజూపి) ఈచిన్నదాని వీణావాదననైపుణి కలరియాయన తనవ్రేలి రవలయుంగరమును దానికొసంగెను. దేవదేవీ! అయ్యగార్లకుంగరము చూపుము.
దేవ:- (తనవ్రేలియందలి యుంగరముం దీయఁబోవును)
విట:- ఎంతసేపే త్వరగాలేచివచ్చి కరము చూపుము.
దేవ:- (లేచివచ్చి సిగ్గునఁ బ్రేమసారుకుఁ జేయిచూపును.)
ప్రే:-(హస్తమును గ్రహించి యుంగరమును చూచి తనలో) మెఱుఁగు లీనుచుండు నీరవల యుంగరము చేత నీ మెబాహులత ననలెత్తినట్లున్నది.
మద-మోహ:-(దేవదేవి చెయిలాగికొని స్పర్శసుఖము ననుభవించుచు నుంగరముఁ జూతురు)

మద:-(ప్రేమసారుని జూపుచు) మామిత్రుఁడు దేవదేవి వీణ వాయింపఁగా వినఁ గుతూహలపడుచున్నాఁడు.

ప్రేమ:-(మిత్రులదెసఁ జూచును.)

విట:-దేవదేవీ! రమ్ము.

దేవ:-(ముందర వచ్చికూర్చుండఁగా విటకంటకి యామెకు వీణనందిచ్చును. ఆమెవాయించును).

తరల. కమలలోచన! పాపమోచన! గాఢప్రేమ నిషేచనా!
అమరరంజన! దైత్యభంజన! యార్తిమేఘప్రభంజనా!
సమరభీషణ! దీనపోషణ! సత్కృపామయభూషణా!
రమణఁగావు; మనాథనాథ! పరాత్పరా! మురసంహరా!

ప్రేమ:-విపంచీ నిక్వణమును గంఠస్వరమును నేకమైయి కాకలీ ప్రధానముగాఁగల యీారవవిన్యాస మెంతయు శ్రావ్యముగా నున్నది.

మద:-విటకంటకీ! మామిత్రుఁడు మెచ్చఁగలిగినంత గాంధర్వ విద్యను వీరికెక్కడ నేర్పఁ గలిగితివి? వీకి గురువెవరు?

విట:-స్వామీ! భరత విద్యయందుఁ దుంబుర నారదులకు సమానులని చెప్పఁదగు జగన్నాథమందుండు రాధాకృష్ణభాగవతులె వీకి గురువు. (దేవదేవింజూపి) ఈచిన్నది నృత్యగానములందుఁబోలెఁ జిత్రలేఖనమందును విశారదయె.

ప్రేమ:-(తనలో) అట్లయిన నిది శారదయె.

మోహ:-ఇంత చిఱుత వయసున నింత విద్యాప్రావీణ్యము వడయుట కడుశ్లాఘనీయము.

మద:-ఈచిన్నదాని కెంతవయస్సు ?

విట:-దీని కిప్పుడు పదియేడవ యేడు జరుగు చున్నది. ముఖర వీక్షా విధాన మింకనుగాలేదు.

ప్రేమ:-మీరవలిందుఁ గొన్నాళ్లుండుదురు గాఁబోలు ?

మోహ:-(మదనునితో) మనమిత్రునకు వలరాయనిసోఁకు దగిలి నట్లున్నది.

విట:-మావచ్చిన కార్యమైనది. రేపే ప్రయాణమై మార్గమున నుండు శ్రీరంగమున దిగి శ్రీరంగేశుని దర్శనము గావించు కొని, తరువాత మాయూరికి గంచికిఁ బోయెదము. తమ పోంట్లు మాపై యనుగ్రహముంచి మమ్ముల నిలిపికొన్న నిలిచెదము.

ప్రేమ:- (మదన మోహనులతో) కమఁబ్రొద్దుపోయినది. మన మింకఁబోవుదము.

విట:-దేవదేవి ! అయ్యగార్లకుఁ దాంబూల మిమ్ము.

(దేవదేవి తాంబూలవుఁ బళ్లెముం దీసికొని ప్రేమసారు నొద్దకు వచ్చును. మదనమోహన ప్రేమసారు లొండొరుల మొగంబులు చూచి కొందురు. మదనమోహనులు దమ దగ్గర నేమియు లేదని ప్రేమసారునికి సైఁగ సేయుదురు. ప్రేమసారుఁడు తన వ్రేలనున్న యుంగరముదీసి పళ్లెములోఁ బడవైచి తాంబూలముందీసికొని లేచును. దేవదేవి మదన

మోహనుల కడకుఁబోఁగా వారుఁదాంబూలము గైకొని లేతురు. విటకంటకీ మధురవాణులు లేచి కేల్మోగిచి మ్రొక్కుదురు.)

మద:- పోయివత్తుము.

విట:- (ప్రేమసారునిగాంచి మ్రొక్కుచు) స్వామీ! మఱ్ఱ మఱవకుఁడు. (మదనమోహన ప్రేమసారులు ముందునడువ వెనుకనుండు యవనిక పడును.)

మోహ:- మిత్రమా! ప్రేమసారా! మున్నెప్పుడైన నిటువంటి సంగీతము వినియుంటివా?

ప్రేమ:- ఇంత భరతవిద్యానైపుణిగల వారెందునులేరు.

మద:- సంగీతమునందుఁబోలె రూపలావణ్యములందును వీర లద్వితీయులె.

ప్రేమ:- రూపలావణ్యవిలాసముల మధురవాణికంటె దేవ దేవియె మిన్న.

మోహ:- అది నిస్సందేహము.

మద:- దేవదేవి కన్య యనికదా విటకంటకి చెప్పె.

ప్రేమ:- మించుటద్దంబుచూపు మాహాత్మ్యవము కాలేదపియె చెప్పెను. మిత్రులారా! కడుఁబ్రొద్దుపోయినది. నేనీవీథి గుండ నింటికిఁబోయెదను. మీరును మీ గృహములకుఁ బొండు. (నిష్క్రమించును.)

మద:-మోహనా! మొట్టమొదటిసారికె వారిహస్తస్పర్శ సుఖంబులభించెఁగదా.

మోహ.- వలంతివి నీవుండ నన్నిసుఖములు లభింపఁగలవు. ప్రేమసారుఁడు మనదారికి వచ్చునట్లున్నది.

మద:- వచ్చునట్లుగాదు; వచ్చినాఁడనియె యనుము.

చ. తనమెయి యూన వీడియనుదాంచి సారెలమేళవించున
వ్వనజదళాక్షి నెమ్మొగము పైనిగుడించెడువాని చూపులం
గనినఁ, గరంబునంటుసమకంబునుజూడఁ, గరంబువానినె
మ్మన మలమోహనాంగిపయి మచ్చికఁగొన్నవిధంబు
చాఁటెడిన్.

మోహ:- వారిమీఁద మనసున్నను జంకు విశేషముగా నుంట
చేఁ దనమనోగతము వెలిపుచ్చఁడాయె.

మద:- విట వ్యాపారమునకు వాఁడు క్రొత్తగదా. అభ్యాస
వశంబున నన్నియుఁ దిద్దుకొనును. వలపువిత్తు వాని హృద
యాలవాలమున నాఁటఁబడినది. దాని యభివృద్ధి మనము
చూడఁగలము. (నిష్క్రమింతురు)

రంగము 3. శ్రీరంగిమందలి యారామము.

(ప్రవేశము-దేవదేవి మధురవాణి)

దేవ:- అక్కా! ఈ సరోవర రామణీయకము విలోకించుము.

క. వనలక్ష్మి చేతి మణిద
ర్పణమోయనఁ దేజరిల్లు చే మిగులం
దనరెడి యిక్కొలఁకునన
వ్వనితామణి మొగముసొగసు ప్రతిబింబించున్,

మధు:- (చూచి యూహించి) దేవదేవీ! ఈ సరస్సు నిస్త
రంగమై నిశ్చలమౌచు హృదయంబు చందంబున మిక్కిలి
సొంపారు చున్నది.

దేవ:- (రాయియెత్తివేసి) అక్కా! ఇప్పుడు?

మధు:- ఉత్కలికోజ్జ్వలమై మిక్కిలి కంపించుచున్నది. తద్గత
భాసుర ప్రతిబింబజాలములు నిలుకడలేక గ్రక్కదలి చెల్లా
చెదరయినవి. అయినను నితర కారణము లెవ్వియు లేమిం
జేసి యాస్థితిపోయి నిశ్చలమైన స్థితికది వచ్చును. అదిగోఁ
జూడు; సంచలము తగ్గుచున్నది. అదె! అదె! నిశ్చలమగు
చున్నది; అయినది.

దేవ:- ఎంతత్వరితగతి నిశ్చలస్థితికి మరలినది. ఆహా! మహా
నుభావుల హృదయంబు లీరీతి నుండునేమొ.

మధు:-సోదరీ! ఈయారామము గడురమణీయముగా నున్నది.
లోనఁ బ్రవేశించి విహారము సల్పుదము.

దేవ:- అక్కా! ఇల్వీడిచి మనము బహుదూరము వచ్చినా
రము. అబలలమగు మన మిరువుర మనన్య సహాయులమై
వనంబు సొచ్చుట భావ్యంబుగాదు. ఇంతదూరము మన
మిట్లు వచ్చుటయే నాకు దిగులుగ నున్నది.

మధు:- సోదరీ! నీవెంత పిఱికిదానవె! ఇందు భయకారణమే
మున్నది? త్వరితముగ మరలుదములే రమ్మ. (లోనికిఁబ్రవే
శింతురు) ఆహా! లోనికిఁ బోయినకొలఁది, ఈ యారామ
రామణీయక మతిశయించు చున్నది.

దేవ:- వనవధూటికా వివాహయోగ్య పరికరము లిందు విస్తరిల్లునట్లున్నది.

సీ. శుకశారికాద్విజస్తోమ నినాదంబు
ద్విజశ్రుతిఘోషమై గజిబిజించు;
ప్రస్తారవల్లరీ వ్యవహితోల్లాభముల్
పెండ్లిపందిరులయి పెల్లుమీఱు;
కుజవీధికాకీర్ణ కుసుమితవిటపాళి
రత్నతోరణములై రహిఁజెలంగు;
కదళికాకమనీయ కర్పూరరాసులు
పరిణయవేదులై కరము వెలయు;
కావేరినిమ్నగా కల్లోలశబ్దముల్
భద్రవాద్యములౌచుఁ బరిఢవిల్లు;
ప్రత్యగ్రమల్లికా ప్రసవకోరకములు
ముత్యంపు సేసలై మురువుసూపు;
పవనోచ్చలితకమ్ర ప్రసవపరాగంబు
వలిగంధ వొడియయి వలపుఁగుల్కు;
సమదభృంగీగణ చారునాదంబులు
ప్రమదాళిపాటలై రమణమీఱు;

గీ. వృక్షలతినుండి క్రిందికిఁ వేళులతలు
పట్టిమంచవుజాలరై బాగు నెఱపు
వనవధూమణికిని చైత్రప్రభువునకును
వైభవంబున వెలయునుద్వాహవేళ.

మధు:- సోదరీ! ఆచెట్లగుంపున కావలనె కావేరీనది గానవచ్చుచున్నది. (ఇరువురు నడుతురు.)

దేవ:- అక్కా! ఇదెచూడు సుఖశీతలములైన కావేరీనిమ్నగా భూషణములు తలఁబ్రాలై మాళిని నలంకరించుచున్నవి!

మధు:- పవనుండు చాల విజృంభించుచున్నాఁడు. ఇదె చూడుము.

సీ. చిలుకపచ్చనియాకుఁ జెఱఁగును దొలఁగించి
తలిరాకుఁగంజెలఁ దలఁగఁదీసి,
విస్ఫారమకరంద స్వేదవారినిగుల్కు
మంజరీ స్తనముల మమతఁజఱచి,
లతికాభుజాశ్లేష మతిమాత్రముగఁ జేసి
పక్వఫలోష్ఠచుంబన మొనర్చి,
చంచరీకశిరోజ సమితిఁజిక్కులు చేసి
పుష్పాడికుంకుమ పొందుఁ జెఱచి,

గీ. పవనధూర్తుండు వనలక్ష్మిభంగపఱుప
శారికాశుకాంగనలు వృత్తములఁ జేసి,
యలజడియుఁ గిన్కయును దమ్మునలముకొనిన
నత్తులెఱచేసి యొనరించి నలబలములు.

కావుననే పవన పల్లవుఁ డంత తొట్రుపడుచు నారామవీధి వెడలి పొదరిండ్లజొంపములఁ దూఱి, మందమందగతుల దొంగపగిది జుణిఁగి పోవుచున్నాఁడు.

దేవ:- నానా సుమనః పరిమళ మిళిత తరుచ్ఛాయా విస్తారితాభిరామంబగు నీయారామంబున విహరించుకొలఁదిని నాకేమో చెప్పరాని మనస్సంతోష ముప్పతిల్లు చున్నది. ఇదియే మన్నివాసస్థానము యగు పక్షమున నేనెంత ధన్యురాలనుగా నుందును!

మధు:- ఈరమణీయవనము మునిజనావాస యోగ్యముకాని మనవంటి పశుపుఁగొమ్మలకు వాసయోగ్యముగాదు. మన బోఁట్లు నివసించుట వలన నియ్యది యపవిత్రమగును.

దేవ:- మనము పవిత్రలమైనను నగుదుముగాని, వనంబవిత్ర మగుట నేను నమ్మను.

మధు:- ప్రేయసీ! నీవు గమనించినావో లేదో యింతవఱ కెక్కడఁ జూచిన నుండు కురువక కాశోక సహకార సిందువార క్రేంకణ వకుళ చంపకాది వృక్షము లీసమీపమున నెందును గానరావయ్యె.

సీ. పణఁతుల పాదతాడన దోహదక్రియ
విరులెత్తును నశోక తరువులేదు;
వనజాక్షుల యాశ్లేషణంబున ననలెత్తఁ
జాలుకురువక భూజంబులేదు;
స్త్రీల శ్వాసావాప్తిఁ జెలఁగి పుష్పింపఁ
గాఁగలసిందువార వృక్షంబులేదు;
సరసిజాస్యల హస్త సంస్పర్శఁ బువ్వులిచ్చు
సహకార భూజ రాజంబులేదు;

హిమకరానన లెలుంగెత్తి పాడఁ బువ్వు
దొడిగెడి ప్రేంకణద్రుమము లేదు;
చంచలాక్షుల హాస చంద్రికా రుచిసోఁకఁ
బూలుపూచెడి సురపొన్న లేదు;
విద్యుల్లతాంగు లాస్యద్యుతుల్ నెఱపంగఁ
గుసుమించు చంపక కుజములేదు;
చెలులు గండూషించి సీధువు నుమియంగ
విరులు పూచు వకుళ విటపి లేదు;
గీ స్త్రీలుచేసెడి దోహదక్రియల నంది
పెంపుగాంచెడు నట్టి యీ పాదపజాతు
లందు నొకటియు నిచ్చోట నెందులేదు;
ఏమి హేతువు దీనికి నెఱఁగునొక్కొ?

దేవ -కాంచనమాలయు వలెను. అక్కా! ఆయున్నత ప్రదేశమున, ఈపుష్పవాటి కావల, ఆయుత్తుంగ వృక్షరాజినడుమఁ, గుటీర మొక్కటిగానవచ్చుచున్నది అది యేమహానుభావుని యావాసమై యుండునో.

మధు:-అందుఁబోయి కనుఁగొందము గాక (ఇరువురు నడతురు. వెనుకయవనిక యెత్తఁబడును.)

(ప్రవేశము: విప్రనారాయణుఁడు
తన కుటీరము మూదరి యరుఁగు మీఁదఁ జెట్టునీడలోఁ
గూర్చుండి)

దేవ:-ఏమి మనభాగ్యము!

సీ. అమృతాంశులోని నైర్మల్యము జాతెనా వద
నంబునఁ బవిరిగడ్డంబు మెఱయ
నర్కుఁగొంచెకుఁగప్పు నరుణాభ్రమునుబోలె
నీర్కావి మునుఁగు మై నివ్వటిలఁగ
నిలువారుతమ్మిరేకుల కీవి ఫాలము
ధ్యంబుపై నూర్ధ్వపుండ్రంబు దనర
శ్రీవైష్ణవజ్ఞాన సిద్ధిముద్రలు నా భు
జములందు శంఖ చక్రములు చెలఁగ,
గీ॥ నియతిఁబద్మాన నస్థుఁడై నేత్రయుగళి
మోడ్చి ధ్యాననిశ్చలత నమ్మురవిదారి
స్మరణ సంసక్త హృదయుఁడౌ సంయమీంద్రు
దర్శనమ్మున్ మనపాప తతులు తఱుఁగ.

అక్కా! మనమిక్కడనే యుండి యీతఁడు ధ్యానము నుండి మేల్కొను సమయమును నిరీక్షించి నమస్కరించి యీతని యాశీర్వాదముం బడయుదము.

విప్ర:- గీ. అభవ! యవ్యయ! వేదవేదాంతవేద్య!
ఆదికారణ! యద్వయ! యప్రమేయ!
సర్వభూతేశ! పరమాత్మ! సత్యరూప!
రంగ! వసియింపు మా యంతరంగమందు.

(దేవదేవీ మధురవాణులు విప్రనారాయణునకు నమస్కరింతురు. విప్రనారాయణుఁడు వారింజూచి చూడక నిష్క్రమించును.)

దేవ:-అగ్రజా! ఇతఁడేల మన నమస్కారములఁ బరిగ్రహింపఁ డాయెను?

ఉ. "మ్రొక్కిన నెవ్వరేమనఁడు మోమటు పెట్టుక చక్కఁబోయెనూ దిక్కునుజూడఁడాయె, మఱిదీవనమాటయునాడఁడాయె వీఁ డెక్కడి వైష్ణవుండుమన మేటికిమ్రొక్కితి మమ్మ! యక్కటా! నెక్కొని వెఱ్ఱిబుద్ధి మెయి సిద్ధరపోయినవాని కాళ్ళకున్".

మధు:- ఇట్లేల యీమహానుభావుని నిరాకరించి పల్కెదవు?

ఉ. "చూచిన నేమి? నీవలనుజూడక యుండిన నేమి? పూజ్యాలం జూచినభక్తి మ్రొక్కుట యెశోభన మీతఁడు బ్రాహ్మణుడుధా త్రీచరులందు బ్రాహ్మణుఁడు దేవుఁడు, దేవుఁడునీవు మ్రొక్కవల జూచునోపల్కనో యటులనుమ్మితఁడున్ సరసీరుహాననా!"

దేవ దేవీ! ఈపుష్పవాటికా సమీపమున సహకారాశో కాదివృక్షములు లేమికిఁగారణ మిప్పుడుగోచరించుచున్నది.

దేవ:-ఆకారణ మేమి?

మధు:- అవియుండిన వానికి ద్రోహదక్రియలు చేయుటకుఁ దరు ణీమణులు రావలసి యుండురు. వారిరాకవలనఁ దనతపో నిష్ఠకు భంగము గలుగు ననుశంక చే నితఁడు వానిని బోషిం పకుండును. అయినను మనమిక్కడికి రాఁగలిగితిమి!

దేవ:-అగ్రజా! నీ వేమియుఁ దెలియనివానివలె మాటాడు చున్నావు. వాతాంబు పర్ణాశనులై జితేంద్రియులని ప్రసిద్ధి గాంచిన విశ్వామిత్ర పరాశరాది మునీంద్రులు తరుణీవశులై యుండలేదా? జడదారులై మున్మథు భస్మీభూతుఁ గావించిన

మహేశ్వరుఁడే దారుకావనవిహారమునఁ దవిలి మదనోన్మాదుఁడై మునిభార్యల పాతివ్రత్యభంగ మొనర్చి విచ్చలవిడిఁ జరింపలేదా? అట్టిమహానుభావులే జవ్వనుల భ్రూకార్ముక విముక్తాపాంగ వీక్షణశిలీముఖ పరంపరలకుఁజిక్కి స్రుక్కి రనఁగ నీవిప్రసామాన్యుఁ డెంత?

ఉ. కొమ్మలమందహాసములకున్ ముఖకాంతికి శ్రావ్యగీతగా
నమ్ములకున్ మృదూక్తికి ననమ్ములవానలు వెంచుపుష్పసం
ఘమ్ములె మోసులెత్తి చనఁగా నవయౌవనసంపదాఢ్యుఁడౌ
యమ్మనుజుండులోనగుట యేమివిచిత్రము ధాత్రిలోపలన్

మధు:- అలభీష్ముఁడు, వినాయకుఁడు, హనుమంతుఁడు, జితేంద్రియులై యఖిలభోగములఁ బరిత్యజించి బ్రహ్మచర్యమున నేమనలేదా? ఇకఁ నేను జితేంద్రియుఁడనై యుందును. అట్లు లేకున్న

సీ. తెలిమించుజిలుఁగు వల్వలు మేనఁ దొడుగక
కావిశాటులు మేనఁ గప్పనేమి?
కామరాజి గీఱునామము దిద్దితీర్పక
పట్టెనామములు దాఁ బెట్టనేమి?
వేడుకగాండ్రతోఁ గూడియాటమాని
వనమున మౌనియై మనఁగనేమి?
భామినీమోహ తత్పరత మెలంగక
బ్రహ్మచర్యసరణిఁ బ్రదుకనేమి?

గీ. బహువిధామోద పరిఫుల్ల ప్రసవమాలి
కలు గలిగియుండఁ ద్రొళసి పూసలసరంబుఁ
దాల్పనేమి? యితఁడు మహాతాపసుండు
గాకయున్నఁ జేయునె యిట్టి కర్మగతులు?

దేవ:-ఒక్కమానవుఁ డిట్టివాఁడని చెప్పుట వానివేషములఁ బట్టియా?

మధు:- త్రికరణములంబట్టియె నిర్ణయింపవలెను. కాని త్రికరణములలో నొక్కటియగు నంతఃకరణము నెఱుంగుట యేరికిని సాధ్యముగాదు. కావున బాహ్యములగు వేషభాషలం బట్టియె యొక్కఁడిట్టి వాఁడని నిర్ణయింప వలసియుండును. బాహ్యస్వరూపము గొంతవఱకు నంతస్స్వరూపమును వెల్లడిచేయును. కాఁబట్టి బాహ్యస్థితిగతులం బట్టిచూడ నితఁడు నిజమైన యోగివరుఁడుగనే చూపట్టుచున్నాఁడు.

దేవ:-యౌవనోదయమునకుఁ బూర్వముసద్వర్తనుఁడై యుండనోపు. మననమస్కారము లెప్పుడు పరిగ్రహింపక పోయెనో యప్పుడే యీతని మనస్సు నాకు గోచరమైనది. ఇతఁడు నిజమైన యోగియని నేను నమ్మఁజాల. ఇతని ధ్యానము బకధ్యానము; ఇతనిజపముపింగళాజపము; ఇతనిబ్రహ్మచర్యము ఘోటకబ్రహ్మచర్యము; ఇతని మంత్రము మదన మంత్రము. అట్లుగాకున్న మననమస్కారముల నితఁడు పరిగ్రహింప కుండునా? తానేమో స్త్రీముఖపరాఙ్ముఖుఁ డనియు, సదాచారసంపన్నుఁ డనియు మన మనుకొనవలె

వని యట్లు లేచిపోయెఁగాక; నిజముగా నీతఁ డింద్రియ నిగ్రహము గలవాఁడై యుండిన, మనకభిముఖుఁడై 'నారా యణ' యని పలికి యుండఁడా? ఇటువంటయ్యాలె చిటుకు మనకయుండి చీఁకటిపడఁగానే వనవాటికవిడిచి విటులై కులటాకుటిలాలకల కుటీరంబులు చేరి, వారి కాలి లత్తుక తమనిటలతలంబులంట వారి పాదనికటంబున వసించువారు.

సీ. కాషాయములు మేనఁగట్టుట మానించి
జిల్గువల్వలఁదాల్పఁ జేయ నేని,
పెనుపట్టెనామముల్ పెట్టుట మానించి
తిరుచూర్ణ రేఖఁ దిద్దింప నేని,
వనవాసమును విడువఁగఁ జేసి గోవాళ్లఁ
గూడియాడుట కాస గొలుప నేని,
హరిచింతనము మాన్పి యఖిలభోగంబు లా
శ్లేషింప నితని నేఁ జేయ నేని,
గీ. చిత్తమున నన్నె తలపోయఁ జేయ నేని,
పల్లవీజనములపాలు పఱుప నేని,
విటులమేటిగ నితనిఁ గావింప నేని,
మునివరో! నీకుదాసినై మనెడిదాన.

మధు:-

శా. ఈవేశాదు దుతెవ్వారైననుసరే యీవైష్ణవోత్తంసున
బ్బాహ్యాభ్యంతరముందు భావభవ దర్పభ్రాంతి చేకూర్చి చే
తోవై కల్యమునందఁ జేసి లవమున్ దోషాన్వితుం [illegible]
[illegible]మాత్ర నిదాసినై గొలుతు నాప్రాణాంత పర్యంతమున్

దేవ:- అహా! నేను నీకూడిగముచేసిన నాకగ్గులేదు గాని, నిన్ను నేదాసిఁగాఁజేసికొనుట భావ్యము గాదు. కావున వేఱొకపన్నిదము గావింపుము.

మధు:-(ఆలోచించి) నీ వీవైష్ణవాగ్రణి బ్రహ్మచర్యమునకు భంగముగావించిన నేనీవేశ్యావృత్తి విడిచెదను; అట్లు నీవు కావింప కుండిన నీవును వేశ్యావృత్తి నవలంబింపఁగూడదు.

దేవ:-అవశ్యమట్లె కానిమ్ము. ఏదీ! చేయిచాఁపుము.

(ఒండొరులు చేతిలోఁజేయివేసి కొందురు)

ఈతనిఁ జొక్కింపఁజేయుని యీయూఁడుజన్మమేల? కంచికిఁ బోయివచ్చి యీ కార్యమునకుఁ బూనెదఁ గాక.

(ఆకసము వంకఁజూచి) ఆ! ఎంతప్రొద్దు పోయినది! ముసలిది చీవాట్లు పెట్టును.

మధు:-చీవాట్లకేమి! అవి తప్పక పడుచునే యుందును.

దేవ:-అదే! ఖద్యోతుఁడు పశ్చిమశైల శృంగంబునఁ దనరుచున్నవాఁడు.

గీ. అభ్రమండలోన్నతుఁడయి యమలగతిని
దనరి దుర్నిరీక్ష్యుండగు తపనుఁ, డైహి
కప్రవర్తన మే మంచి కర్జమనుచుఁ
దెలియఁజేసెడిరీతిఁ బృథ్వినికట వి
భాసియయి చిత్రరాగంబుఁ బర్వఁజేసి
లోచనానందుఁ డయి యదే గోచరించు.

ఓకమలాప్తా! లోకచక్షూ! లోకసాక్షీ!తమోరీ! నీ వేతరణివి.

నీసహస్రకరముల రక్షించి నాకష్టముల నన్నిటిని గడదేర్చి నన్ను గట్టెక్కించుము. (దేవదేవి మధురవాణులు తూర్పు దిక్కుగా మరలుదురు.)

మధు:-(చంద్రుని వంకఁజూచి)

గీ. అల్లదిగో! చూడు కువలయాహ్లాదకరుఁడు
జారుఁడు నిశాచరుండు దోషాకరుండు
నైన రాజు నీదు ప్రతిజ్ఞ యరసి చూచి
తన కలనడక పోదుమో యని కలఁగి
కోపమున గెంపు మొగముపైఁ దోఁపఁ, దూర్పుఁ
గొండ మెట్టెక్కి వచ్చెడిఁ గోమలాంగి!

ఓ రాజా! రాజా! మాపై నీచల్లనికరములు వేయరాకుము.

దేవ:-అక్కా! మనము సరస్సమీపమునకు వచ్చినారము.

మధు:-సకలజీవులకు స్వేచ్ఛాపరిణామ సహజమని చాటురీతి నిదె చూడు సరోజహర్మ్యంబులు నిమిత్తాలిటిరూపులు దప్పి కారాగృహంబులుగఁ బరిణమింప భ్రమరాంగనలు వానిం బరిత్యజించి నీలోత్పల గేహంబులఁ బ్రవేశింప నెంత సంభ్రమమునఁ బోవుచున్నవో!

దేవ:-స్వాతంత్ర్యము స్వర్గలోకమని కదా యందురు. అక్కా! చాలఁ బ్రొద్దు పోయె. విసవిస నడువుము.

(నిష్క్రమింతురు.)

---

# విప్రనారాయణ నాటకము

## ద్వితీయాంకము

రంగము 1. కంచి. విటకంటకి గృహమందలి యొకగది.

(ప్రవేశము. దేవదేవి మధురవాణులు)

దేవ:- అక్కా! స్త్రీలకు రహస్యరక్షణశక్తి లేదందురు. నీ వీ రహస్యమును నెట్లు మనసున దాచుకొందువో.

మధు.- నే నేల యీరహస్యమును నితరులకుఁ దెలుపుదును?

దేవ:-మన యింటిముసలి దానికిఁ దెలిసిననామె తప్పక నన్నుఁబట్టి తెప్పించును. అప్పుడు నా ప్రతిజ్ఞ భగ్నమగుటయె గాక, మన మిరువురముఁ గష్టములపాలగుదుము. కావున నా పోయెడు సంగతి మామెకుఁ దెలియకయే యుండవలెను.

మధు:-నీ వీ విషయమై భయపడఁ జనదు. ఉదయమున ముసలిది నన్నడుగు నప్పుడు నేనేమియుఁ దెలియని దానివలెనుండి దుఃఖముతో నుండునట్లు నటింతును.—నీ వెవ్వరిని దోడుదీసి కొని వెళ్లెదవు?

దేవ:-నాసాహసమే నాకుఁ దోడు.

మధు:-

గీ. అంగనా మణి మణిభూషణాంబరములఁ
జక్కఁదనమును యౌవనసంపదయును
నొంటిపాటును పీలి యొంవొక్కఁ బోకఁడె
దుష్టులను జాలఁ బ్రేరేఁచు దోషములకు
నిన్నియును గల్గు నీ వెట్లు లేగఁ గలవు?

దేవ:-ఈ యుషఃకాలమున మాఱువేషమునఁ బోవునన్నవ్వారు గుర్తింపఁగలుగుదురు?

మధు:-ఏమి వేషము వేసికొందువు?

దేవ:-హరిభక్తు నొద్దకుఁ బోవుదానఁ గావున హరిభక్తురాలి వేషమే వేసి కొందును. నేను దాని కొఱకాయత్తపఱచిన వస్త్రముల నీవు చూడలేదు. ఇక్కడ నే యుండుము; నేనిదే వచ్చెదను. (నిష్క్రమించును).

మధు:- ఆహా! ఇది కడుసాహసికురాలు. పట్టినపట్టు తప్పక కొనసాగించును. కొనసాగింపనీ. అదియు సర్వ విధములమంచిదే. కాని, పుట్టినదాదిగ విడిపోవని మదీయ సోదరి నడఁబాసి నేనట్లు కాలము గడపఁ జాలుదును?

గీ. పూస లందుండు దారంబు పోల్కి, క్షీర
మందుఁ జేరిన నీరంబు చందమునను,
భేద మెఱుఁగక యేకమై పెరిగిపట్టి
సోదరిని బాసి యేనట్టు లుండ నేర్తు?

పోవలదని దీని బతిమాలికొందునా?
ఉత్కంఠాన్విత యగునిది యట్లు వినునది కాదుగదా. ఇప్పుడేమి యనుకొన్నన నేమి ప్రయోజనము? విధినిర్ణయము దాఁట నెవ్వరితరము?

(పునః ప్రవేశము: దేవదేవి
యోగినీ వేషమున, నాకముతో)

దేవ:-అక్కా! నేనిప్పుడెట్టులున్నాను?

మధు:-అచ్చపు యోగినినై నావు.

దేవ:-ఈ వేషమున నే నాతని వంచింపఁ జాలుదునా?

మధు:-ఆ వైరాగ్య సంపన్నుఁడు నీచేత వంచితుఁడు కాఁగలఁడని నేనెట్లు చెప్పఁ గలను?

దేవ:-ఆరామము చేరు వఱకీ వేషమున నె యుండి పిదప నవసరముం బట్టి చూచికొందును. ఈ మూటలో నా సొమ్ములు వస్త్రము లుంచుటయె గాక, నేను లిఖించిన కొన్ని చిత్రపటములు గూడ నున్నవి. మఱియు నారామమునఁ గాలము భారముగా దోఁచు నెడలఁ జిత్తవినోదముగ నేవేని చిత్తరువుల వ్రాయుటకు వలయు పరికరములను సయితమిందుంచి యున్నాను.

మధు:-నీవుకడు జాణవు. మఱచితి, దేవదేవీ! గడువు నిర్ణయించ లేదు.

దేవ:-నేఁడు మొదలుకొని యేడు మాసములు. సాధ్యమైన ముందుగా నే వచ్చెద. అక్కా! నమస్కరించుచున్నాను. (నమస్కరింపఁ బోవును)

మధు:-(అంఁపుచుఁ బరిహాసముగా) నీవు యోగినివి గదటమ్మా భోగినికి నమస్కరింపవచ్చునా?

దేవ:-(చిఱునవ్వు నవ్వుచు) ఇదియంతయుఁ గపటవేషము గదా. పోయివచ్చెద. (నమస్కరించును)

మధు:-విజయ మగుఁగాక.

దేవ:-ముసలిది తనగదిలో నిద్రించుచుండును.

మధు:-మెల్లఁగ నడువుము. వీధి వఱకు వచ్చి నిన్ను సాగనంపె దను. (నిష్క్రమింతురు)

రంగము 2. కంచియందు నొకవిడిది.

(ప్రవేశము: ప్రేమసారుఁడు)

ప్రేమ:-(తనలో) హా! దేవదేవీ! నీవు మీవారితోడఁ గాంచీ పురము చేరి నేఁటి కాఱుదినము లాయెనని విటకంటకీ మధు రవాణులు చెప్పిరి. నీవు గానరాక మూఁడు నాళ్లాయె నఁటగా! నీ వెందున్నావు?

క. ఘనమేఘు మధ్యమందున
జనియించిన మెఱుపు వోలెఁ జయ్యననాకుఁగా
గనుపించి మఱుఁగు పడితివి
ఘనవేణీ! నీదుపొందు గలుగునె యకటా!

అయ్యారే! పునస్సమాగమమె దుర్లభమై యుండ నీ పొందెట్లు లభించును? అబలా! పదిలముగ వేయఁబడిన యింటిగడియలు దివిచి కవాటములు దెఱచి నిశాసమయ మున నేరికిఁ జెప్పక నీ వెందుఁబోయితివి? కడుఁగట్టిఁడి యగు నీతల్లికిఁ జెప్పకపోయినను మానెఁగాక, నీప్రియ సోద రియగు మధురవాణికి నయితమేల చెప్పకపోతివి? శుక వాణీ! నిన్నెవరైనను బెల్పుఱచి సమ్మతింపఁజేసి లేవఁదీసి కొనిపోయి యుందురా? తెలిసిన సంగతులం బట్టిచూడ నేమియు నిర్ణయింప రాకున్నది. పుష్పబాణీ! నీ దివ్య రూపులకు సోయగముఁ జూచి నిన్వలచి వచ్చిన నన్నెఱి

చేసెదవు? నిన్నుఁబొందని నాభాగ్యమేల? మదీయ చిత్త చోరిణివగు నిన్నెట్లు పడయ నగును?

మ. గృహముల్ క్షేత్రము లన్నిపోయినను బోనీ, సాధువర్గమ్ములనా సహవాసంబును వీడినన్ విడువనీ, సంపూజ్యులౌ పండితుల్ సహితంబు న్నను నిందచేసినను వాలాయంబు నిందింపనీ, సహకారాళిసహాయముం గొనినినున్ సాధించియే తీరుదున్

ఇంక నా మనోగతమును మదన మోహనులకుఁ దెల్పక తీర దు. వారితో నాలోచన చేసెద. ఇప్పుడే మధురాపురికిఁ బ్రయాణ మయ్యెద. (నిష్క్రమించును.)

రంగము 3. కంచి. విటకంటకి గృహము.

(ప్రవేశము: విటకంటకి)

విట:-(తనలో) అయ్యో! ఏ వేళనిల్వెడిచితినో కాని, కాంచీ పురమునకు మరలిన దాదిగఁ గష్టములపైఁ గష్టములు వచ్చుచున్నవి. మధురవాణి నుంచుకొన్న ధనమిత్రుఁడును బహుశా రగుప్తు నొద్దకుఁ బోయితి మన్నకారణమున మధు రవాణిని వదలెను. ఇది యిట్లుండ గోరుచుట్టుపై రోఁకటి పోటన్నట్లు దేవదేవియు సర్వాభరణంబులతోడ నెవ్వనినో లేవఁదీసికొనిపోయె. అయ్యో! ఈజంత యెందుఁబోయి యుండును? ఏవిటు నడిగినను, ఏయాత్రికుఁ బ్రశ్నించినను, దమకుఁ దెలియదను వారేకాని దానిపోకడ దెలుపు పుణ్యాత్ముఁడొక్కఁడైనను లేఁడు. (కోపముతో) కానీ,అది నాచేతఁ జిక్కనీ. అప్పుడు దానికిఁ దగినశాస్తి చేసెదను.

ధనగుప్తుఁడు విడిచిన నాఁటఁగోలె మధురవాణియు విటుల నొల్లకున్నది. కారణ మడిగిన దుఃఖమని చెప్పును. నాథ లేని దుఃఖము దీనికేమి? దీనికిఁ దెలియక యే యీ పిసాళి తొత్తూరేగి యుండునా? ఇది నామొందరఁ గపట నాటక మాడి నన్ను వంచించు చున్నది కాని. అక్కటా! ముప్పున కయ్యెదరని కదా వీరిని నేనుగాని పెంచుకొంటిని. నిలువెఁడు విత్తము వెచ్చించి యొందఱనో యాశ్రయించి ప్రవాస క్లేశమున కోర్చి, వీరికి నృత్యగీత చిత్రలేఖనాది లలిత కళల నభ్యసింపించితిని. పిట్టపిడుగున నీజంతల కిట్టి రిమ్మపుట్టునని యెఱుంగనైతినే. మంచిదని నేఁదలంచిన దేవదేవియె నన్నుఁ గికురించిపోవ, ఇంకనీ వంచకురాలగు నీపెద్దదాని విషయమై నేను మెలఁకువ పడకున్న, దాని సొమ్ములనైనను నాయధీనము చేసికొనకున్న, నాగతి యేమగో గతి యగును. (కోపమున) మధురవాణీ! మధురవాణీ!

(ప్రవేశము - మధురవాణి)

మధు:- అమ్మా! ఏమి?

విట:- ఇంకేమి? ధనగుప్తుఁడా నిన్నువదలె. విటుల నెందఱ నీయొద్ద కంపినను వారితో సరస సల్లాపము లాడవు. ఇట్టి దానవగు నీకీ సొమ్ములేల? నీవర్తనము చూడ నీవును దేవదేవివలెనే యెవ్వనినో యెత్తికొని పాఱి పోవునట్లు

నాకుఁ దోఁచుచున్నది. ఇంకనే నెవ్వరిని నమ్మను. నీ యొడలి మీఁది సొమ్ముల నూడ్చి పెట్టు.

మధు:- (ఏడ్చును.)

విట:- నీదొంగ యేడ్పు లెక్కసేయను. ముందుగా సొమ్ములనూడ్చి పెట్టు.

మధు:- అమ్మా! నేనేమి ... ...

విట:- మాఱుమాటాడకుము. నేఁ జెప్పినపని ముందుగాఁ జేయుము.

మధు:- (తన యొడలిమీఁది సొమ్ములఁ దీసిపెట్టును.)

విట:- ఇంక నిష్టముండిన నింట నుండుము; లేదేని యొక్కడైనఁ బొమ్ము.

మధు:- నేనెందుఁ బోవుదానను! హా! దేవదేవీ! (ఏడ్చును.)

విట:- దేవదేవి పేరెత్తకుము. దాని పేరు విన్న నిలువెల్ల మండును. ముందుగా నీ చోటు విడిచిపో.

మధు:- హా! దేవదేవీ! (ఏడ్చుచు నిష్క్రమించును.)

విట:- ఇది యొకదేవి పోయిన్న దానిని బోనిత్తునా? దీని నొక్క పారకనుజేసి మూలను వైచెద (సొమ్ముల నొడిలో నుంచుకొని) ముందు వీని నినుపపెట్టెలోఁ బదిలపఱచెద.

(నిష్క్రమించును)

రంగము 4. శ్రీరంగము. విప్రనారాయణారామము.

(ప్రవేశము: దేవదేవి, యోగినీవేషముతో)

దేవ:- మును పొక్కసారి తిరస్కృతిఁ బొందిన నాకు నాకు

శ్రూష నీయోగివరుండు పరిగ్రహించునా యని శంక వొడముచున్నది. ఏమి! ఇంతదూరము నన్ను సుఖముగా దెచ్చిన నాపాలిటి శ్రీరంగేశుఁడు తిరస్కృతి యేల నాకు ఘటిల్లఁజేయును? ఇప్పుడీ యువనీసురుం డేమి చేయుచుఁడునో. (పరికించి చూచి) అల్లదే! తోఁటపనులు చేయుచు నీ యెడనే యున్నాఁడు. ఘర్మాంబువులు మేనఁ గ్రమ్మ గ్రుద్దలి చేతఁబట్టి పాదులు ద్రవ్వు చున్నాఁడు! ఈతని కేను గాన్పించి యుందునా? సాంద్రము గాఁ బెరిగిన యీచెట్ల పొంపముల చాటున నేనుండ నితఁ డెట్లు నన్నుఁ జూడఁ గలుగును? ఈచెట్లమఱుఁగున నే యుండి యీతని చర్యాదికములఁ బరికించెదఁ గాక. అదే! త్రవ్వుటను జాలించి దారుకాయంత్రము సాహాయ్యమున నీళ్ళెత్తి తులసివనమునకుఁ బార్చు చున్నాఁడు! అహా! ఏమి యీతని శరీరపాటవము! ఆయురఃపీఠివిపు! ఆవిశాల బాహామూలములయున్నతి! ఆ కండెముల్ దిరిగిన చేతుల యందము! అదే! ఎటకో నడుచుచున్నాఁడు! ఓహో! మగవలు మార్చుచున్నాఁడు! మరల దారుకా జలయంత్రము వంతకుఁబోవుచున్నాఁడేమి! పెండియునీరెత్తు చున్నాఁడు! ఔరా! ఏమి యీతని తోరిమి! అనన్య సహాయుఁడై యింతపని చేయుచున్నాఁడు! ఇప్పుడేపోయి యీతనికి సాయమొనర్చి నన్ను నేఁ దెలిపికొందునా? ఏటి కింత త్వర? ఈ ఉద్యానాంతమున దర్శించి నే నెట్టెటని నావలం దగులో

నం జేయు నేస్తును? దీన నా కపట స్వభావము వెల్లడియై నేను వంచకురా లని మాత్రము తెలియును. అప్పుడు నన్ని తఁడు చేరఁదీయునా? మఱియు వస్త్రాభరణాదులు గల యీమూటతో నిమ్మునీంద్రుని సందర్శించుట భావ్యము గాదు. అయిన నీమూట నెందుంచ నగును? (చుట్టును దిరిగి చూచి) ఆ! ఈతరుకోటరం బిందుల కెంతయుఁ దగియున్నది. నాకుఁ గావలసిన వస్త్రాదికములఁ దీసికొని యిప్పటి కీమూట నిందుంచెదఁ గాక. (కొన్ని వస్త్రాదికము లం దీసికొని) నేను దీని నిందుంచుట నెవ్వరుఁ జూడరు గదా. (నల్దిక్కులు మరలఁ బరికించి చూచి) ఓ! వట వృక్షమా! మదీయ భూషణాంబరాదుల నిందుంచు న్నాను. వీనిని రక్షించుభారము నీయది. (తోఁటలో మూటనుంచి మరల మునివైపు చూచి) ఓహో! వైష్ణ వాగ్రణి పుష్పాదులు గోసికొని కుటీరము దిక్కుగాఁ బోవుచున్నాఁడు! నేను పోయి సమయముఁ గనిపెట్టి యాతనిఁ దగినభంగి దర్శించెదఁ గాక.

(నిష్క్రమించును.)

రంగము 4 అదే యారామ మందలి కుటీరసమీపభాగము.

(ప్రవేశము: విప్రనారాయణుఁడు చెట్టుక్రిందఁ గూర్చుండి పుష్పదామములు చేయుచు, దేవదేవి రాక వాంఛావేశమున దూరమున)

దేవ:- భగవదర్పణము కొఱకుఁ బూలసరములఁ గూర్చుచుఁ

దోఁచుపనులనాలనుఁ గలిగిన బుద్ధిని కను చీర్చుకొనుచున్నాఁడీ వైష్ణవశిఖామణి. ఇదే దర్శనమునకు మంచి సమయము. (విప్రనారాయణుని సమీపించి) ఓ నియమానుషంగా! హరిపదరాజీవభృంగా! దీనరక్షా కృపాంతరంగా! దీనురాల నగు నన్ను రక్షింపుఁడు; రక్షింపుఁడు. (నమస్కరించును.)

విప్ర:- ఆస్తురాలా! లెమ్ము నీకు శుభమగుగాక. నీవెవ్వరవు? నీ యాగమనమునకుఁ గారణమేమి? ఇయ్యెడకు నీవు రా మేము నీకుఁ జేయవలసిన కార్యమెద్ది?

దేవ:- ఓ మునిసార్వభౌమా! నన్ను దేవదేవి యని యందురు. నేను విప్రకులసంజాతను. నా కగ్రజ యొకతె గలదు. మేము శిశువులముగా నున్నప్పుడు దౌర్భాగ్యురాలగు మా జనని తన దారిద్ర్యకారణమున మమ్ముఁ బోషింపఁ జాలక కాంచీనగరమందలి యొక వేశ్యకు మమ్ము విక్రయించెను. ఆ ముసలిగరాసు స్వప్రయోజనము నిమిత్తము మమ్ము నృత్యగానాద్యనేకతాంత విద్యాధురీణలఁ జేసి, నా యగ్రజను కడు గర్హణీయమైన వేశ్యావృత్తియందుఁ బొనిపెను. నన్నుఁ గూడ దద్వృత్తియందే ప్రవేశపెట్టఁ జూచెను గాని, నేను నాలుగక్షరము లెక్కువ నేర్చినదాన నగుటచే అమ్మనుగడ యూనక్షీణజుగుప్సాకర మని న్నాకుఁ దోఁప, నే నామెగృహమువిడిచి మీతిరునడిఘ శ్రాశ్రయించి యొట్ల యిన నీడేఱ వలయునని వచ్చితి.

సీ. "నిర్వాణరాజధానికి నేగువారికిఁ
జక్కని పెనుత్రోవ యాచార్యసేవ,
విరజానదీ సముత్తరణంబునకు మనో
జవమైననావ యాచార్యసేవ,
త్రిజగజ్జనులకు సతీపతి వ్యాయమై
చాగినత్రావ యాచార్యసేవ,
అజ్ఞాన హతులను విజ్ఞానులను జేయు
సంజీవనీవ యాచార్యసేవ,

గీ. యాశ్రయించిన వారల కరి నిచ్చు
విష్ణుసాలోక్య సారూప్య వివిధదివ్య
భోగసామ్రాజ్య వైభవా భోగమహిమ
శాశ్వతం బైన శేవ యాచార్యసేవ."

ఓదయాసింధూ! ఆచార్యబుద్ధిమై నిమ్ము సేవింప వచ్చి
న నన్ననుగ్రహించి నా యాడిగము పరిగ్రహింపుఁడు.

విప్ర:-

గీ పడఁతుకల తోడి సహవాస వర్తనములు
చంద మగునొక్కొ మముఁబోలు సంయములకు?
కొంసరి కరుణమై నీసేవ గొనుదు మేని
పుడమి జనము లేమని తలపోయు వారొ.

దేవ.-వైష్ణవాగ్రేసరా! లోకులు కాకులు. వారు సత్యాసత్య
విమర్శనము చేయరు. వట్టి లోకప్రవాదమునకు మీరే
వెఱచిన నేనేమందును?

విప్ర:-భక్తురాలా! లోకాపవాదమునకు వెఱవక యుండుట యెట్లు సాధ్య మగును? శ్రీరాముఁడు లోకాపవాదమునకు వెఱచి కదా రావణు గృహమున నున్నసీతను స్వీకరింపక ఘోరాతి ఘోరమగు పరిశోధనకు లోఁబఱచెను.

దేవ:- మన మనస్థితుల నెఱుంగనివారు మనల నేమనుకొన్న మన కేమి కొదవ? మీరు దృఢభక్తి సంపన్నులరు. నేనును భక్తురాలను. కావున నట్టి యపవాదమునకును నవకాశ ముండదు. మఱియు నేను భవదీయ శుశ్రూషా లాభమున

సీ. ఇందిరా సుందరీ హృదయాబ్జ మిత్రుఁడా
లంబవు దివ్యాంగంబు గాఁగ
ఆతని భవ్యదివ్యానన బింబ మే
ప్రవిమల దీపికావళి కాఁగ
సమధిక నిర్మల సద్భక్తి యే నిర్మ
లం బగు మంచి తైలంబు గాఁగ
ఆతతధ్యాన ధారారూఢి శతసూర్య
ప్రభ మించు నుజ్జ్వలజ్వాల గాఁగ

గీ. ప్రవిమల జ్ఞాన దీపంబు నవిరళముగ
నచ్ఛముగను నాత్మారామ ముందు వెలుఁగ
నునిచి కామాది రిపువర్గభూతకారంబుఁ
జంపి జలక మాడెద శాంతి సరసి లోన.

కావున నో మునిపుంగవా! మదీయపరిచర్యం బరిగ్రహించి నన్ను ధన్యం జేయుఁడు. ఆరామకార్యము లందును దమ కేను జేదోడు వాదోడుగా నుందును. మఱియు మదీయ సంగీతాభ్యాసము సఫలముగ భగవద్దివ్యనామ సంకీర్తనము చేయు చుందును.

విప్ర:- (తనలో) ఆకస్మికముగను, అయాచితముగను, లభ్యమైన యీ హరిభక్తురాలిని వలదు పొమ్మన నేల? ఈమె సాహాయ్యమున శ్రీరంగధామ కైంకర్యము నిర్విచారముగఁ గొనసాగును గదా. ఈ సంగతి యడిగి తెలిసికొనియెద. (ప్రకాశముగ) భక్తురాలా! మేము భిక్షాన్నముం దెచ్చి భుజింతుము. నీవును దానినే భుజింపవలసియుండును.

దేవ:-అవశ్య మట్లే కానిండు. నంటకై వినియోగింప వలసియుండు కాలమును సహితము సమయోచితముగా విష్ణుకైంకర్యమునకొ, యారామకార్యములకొ, భవదీయ పరిచర్యలకొ, వినియోగించెద.

విప్ర:-భక్తురాలా! నీ నిర్భరభక్తితాత్పర్యములు నాకుఁ గడు సంతసము నింపుచున్నవి. నిన్ను శిష్యురాలినిగాఁ బరిగ్రహించుచున్నాను. నావలెనే నీవును శ్రీరంగేశ కైంకర్యము నందుఁ బ్రొద్దులు పుచ్చుచుఁ దోఁటపనుల యందును నాకుఁ దోడ్పడెదవు గాక. ఇదిగో! ఆపర్ణకుటీరము నీ యిక్కువగాఁ జేసికొనుము. నే నీమాలికలఁ గొని శ్రీరంగేశునకు సమర్పించి భిక్షాన్నముం దెచ్చెద. (నిష్క్రమించును)

దేవ:-అమ్మయ్య! ఇప్పటికి నే నించుక ధన్యురాలి నయితిని. ఇంక నీతని నావలలో వేసికొనుట యంత కష్టమైనపని కాదు. న న్నుండ నియమించిన కుటీరము కూడ ముని కుటీరమున కనతి దూరమున నే యున్నది. ఇది నాకు మిక్కిలి యనుకూలము. (నిష్క్రమించును.)

రంగము 6. మధుర. మదనుని గృహము.

(ప్రవేశము: మదన మోహన ప్రేమసారులు కూర్చుండి)

మోహ:-ప్రేమసారా! ఎంద ఱెందఱో సుందరు లగువెల యాండ్రుండ, నెందును గానరాని యా దేవదేవి యే కావలె నని యేమి?

ప్రేమ:-నెయ్యులారా! దాని మీఁద నాకు మనసు పడినది. నాకు పుట్టమొదట మదనమంత్రోపదేశము చేసిన యాచార్యులరు మీరేకదా. ఆరమణిని గూర్చుభారమును మీరయుదిరె.

మోహ:-కమఁగూర్చు మిత్రులము మేముండ దేవదేవిని నీకుఁ గూర్పఁ జాలమా? ఎందుండినను దానిని నెమకి కూర్చు భారము మాయది.

మద:-నీవు కాంచీపురమునకుఁ బోయి నప్పుడు దాని విషయమై చక్కఁగా విచారించితివా?

ప్రేమ:-విటకంటకిని, అరక్షులను, వెంటఁగొని పుర మంతయు గాలించితిని. ఎందఱనో యడిగితినికాని దానిసవయే తెలియ లేదు; దానికిఁ బ్రియు లెవరైన నున్నారా యని విటకంటకీ మధురవాణుల నడిగితిని. వారు తమ కెఱుక యున్నంత వఱకు దానికిఁ బ్రియులెవ్వరును లేరనియు, దాని పూర్వవర్తనము గూడ ననుమానింపఁ దగి నట్లుండ లేద నియు నుడివిరి.

మద:-కఱచెడి కుక్కలు మొఱుఁగ నట్లు, కార్యపరులు పలు మాట లాడరు.

మోహ:- బహాళ ధనసంపన్నుఁ డెవఁడో తన్ను బేల్పఱుప వాని వెంట నదిపోయి యుండును. ఎన్నాళ్ల నుండియో చేయఁ బడిన ప్రయత్నము మీఁద నిది జరిగి యుండును.

ప్రేమ:- అట్లే యై యుండును. కాని, యెవని వెంట నెందుఁ బోయి యు డునో యెఱుఁగుట దుర్లభము.

మద:-మిత్రసత్తమా! మే మురుపురము కాంచీపురమునకుఁ బోయి యందు విటకంటకీ మధురవాణులతో సంభాషించి దేవదేవికిఁ బసదనంబు లొసంగిన యుత్తర దిగ్భాగ మం దలి దేశాధీశుల యొక్కయు, ధనసంపన్నుల యొక్కయు నామధేయములఁ గొని యాయా దేశములకు వెళ్ళి యం దు వెదకెదము. నీవును దక్షిణ దేశముల వెదకుము.

ప్రేమ:-నేను మిమ్ముల నడిగి మీ సేవఁ జేయించుకోఁ దలఁచిన కార్యమును మీరే చేయ నెంచితిరి. ఇట్టి యింగితజ్ఞ లును, అనురాగ పూర్ణులును నగు మిత్రు లుండ నా కేమిటఁ గొదవ? మిత్రులారా! మీ వ్యయమునకుఁ జెలి యొక బంగారు కడియమును గైకొనుఁడు. (మదనమోహ నులకుఁ జెలియొక కంకణముఁదీసి యిచ్చును.) ప్రయాణ మునకు సిద్ధపడుఁడు నేను దక్షిణదేశములం జూచెదను. పోయివచ్చెద. (నిష్క్రమించును)

మద:-మోహనా! విని [illegible] నా వెలయాండ్ర కవుఁగిళ్ల మనము వసించి రావచ్చును.

మోహ:-మదనా! మేలు మేలు. నేఁడే కంచికిఁ బ్రయాణమగుదము. (నిష్క్రమింతురు.)



# విప్రనారాయణ నాటకము

---

## తృతీయాంకము.

రంగము 1. శ్రీరంగమందలి యొక దే యారామభాగము.

(ప్రవేశము: దేవదేవి, చేత సలగపాఱ పట్టుకొని మడవలు గట్టుచు)

దేవ:-

సీ. మొదిచి మెత్తిన సంకుమదపంక మాయెను
మడవలు గట్టఁ బైఁ బడిన బురద;
కమ్మతావుల నీను గంధచూర్ణం బయ్యెఁ
బాదులు ద్రవ్వఁ బైఁబడిన దుమ్ము;
వలిమించు పన్నీరు చిలుకరించుట యాయె
నలపుచే మేనఁ గలుగు చెమట;
కస్తూరికాపరాగంబు చల్లుట యాయె
గంపు మోయఁ బైఁ గాఱు నెరువు;

గీ. ఉపనిషత్సారమును గ్రోలు తపసి మేటి
మనసిజోపనిషత్సారమునకు మరగి
యెపుడు నా మనోరథము లీడేర్చువాఁడొ
కటకటా! మోక్షు సుదినముల్ గలుగఁ గలవొ?

అప్పుడు గదా నాపని ఫలించిన దగును. ఆహా! సుఖ
ము. ముందెప్పుడో వచ్చునన్న యాశయె గదా నా దుఃఖ

మును మాన్పి నా కుత్సాహ మొసంగుచున్నది. ఆయాశ చేతనే గదా యాశ్రమము చేరి యీయాశ్రమ మెంత దైనను నోర్చుకొనఁ జాలి యున్నాను. ముందు దుఃఖమే ప్రాప్త మగునని నేనిప్పుడే యెఱింగి యున్న, నాజీవనమే భారమును దుఃఖభాజనమునై యుండును గదా. ఆహా! అపరిజ్ఞాన మెంత మహోపకారకము! ఎంత యానందదాయకము! ఇట్టి పట్టుల భావికాలజ్ఞతకై పెనఁగులాడు టెంత వెఱ్ఱితనము! మఱియు రాత్రి సద్వర్గమును జూపునట్లు, ఈ యపరిజ్ఞానము దృష్టి కతీతమగు వస్తువులను జూపవచ్చును గదా.

(ప్రవేశము-విప్రనారాయణుఁడు)

విప్ర:- భక్తురాలా! నీళ్లు పాదులు నిండి పొరలి పోవుచున్నవి. ఇట్లేల పార్పితివి? నీవేమో యొక్కతీరున నున్నావు. ఇప్పుడే గాక కొన్నాళ్లుగా నిట్టిమార్పు నీయందుఁ గానఁబడుచున్నది. నీ సోదరిం జూడ నీకేమైన మనసు గలిగెనా? అట్లయినఁ గొన్నాళ్లూరికిఁ బోయిరమ్మ.

దేవ:- భూదేవశిరోమణీ! మీకారుణ్యమునకై యభివందనములర్పించుచున్నాను. నేను మీ యూరు సీమ వసియింప వచ్చిన దానను; నాకెందుఁ బోవుటకు మనసు పుట్టును?

విప్ర:-నీవు సంకోచింప వలదు. ఆ రామకార్యము లన్నియు నేనే చూచికొందును. కంచికిఁబోవు తైర్థికు లనేకు లుందురు. వారిని తోడుచేసి పంపెదను.

దేవ:-(తనలో) ఆరామకార్యములఁ జూచి కొందు నను చున్నాఁడే కాని యీ రామకార్యములఁ గొంచెమైనను దలపెట్టఁడు. (ప్రకాశముగ) కరుణాసింధూ! ఈ లతకూన విసరు వీవనలఁ బరిగ్రహించి యెఱుఁగరు ఈ మావి ఫల ము రుచి మీరు చూడ నైనను లేదు. అప్పుడే నేనటఁ బోదును? ఇంకను గొన్నిదినములు కానిఁను. పిదపఁ జూచె దఁగాక.

విప్ర:-నీ యిష్టానుసారమే గానిమ్ము. నేఁడు నీళ్లుగట్టుట చాలు. పోదము పద.

దేవ:-(తనలో) ఈ భూసురుని పలు కుపశ్రుతి యగునా?

(నిష్క్రమింతురు.)

రంగము 2. కంచి విటకంటకి గృహము.

(ప్రవేశము: మధురవాణి)

మధు:-

మ. చెలియల్ కోమలి ముద్దరా లబల రాక్షేమంబుగాఁ జేరెనో
యలయారామము, మార్గమధ్యమున నాయానంబుమైఁ జిక్కెనో,
తలిదంబోసి నిరాకృతిం బనసి ఖేదప్రాప్తిఁ జెం గుందెనో,
కులవిప్రోత్తము పొందుఁ గాంచి పరమాహ్లాదంబుతో నున్నదో.

ఎట్లయినను నాసోదరి నాకంటె నుత్తమసిరి యుండే నుండు ననుటకు సందియములేదు. అదియిల్వెడిచి దాదాపు

రెండు నెల లగుచున్నది. ఇంక రమారమి యైదు నెల లెట్లు గడచుదాననో కదా. అది వెళ్లిన దాదిగ ముసలి దాని యాగడమును, దన్మూలమున నా మనోదుఃఖమును, నధిక మగుచు వచ్చె. అది యుండుతతిఱి మాకుఁ గల్గిన సంకటము లొండొరులకుఁ జెప్పికొని దుఃఖమును బంచుకొని యొక్కరీతిగాఁ గాలము గడపుచుంటిమి. ఇప్పుడు నా యుబుసెవ్వరితోఁ జెప్పికొందును? ఇరుగు పొరుగు వారగు నమ్మలక్కలతో రహస్యముగఁ జెప్పికొందునా, వారును గట్టివాయి యగుముసలి దాని పక్షమునే వహించి నన్నే నిందించి దూషించి సంగతులను వతిశయోక్తిగా ముసలిదానితోఁ జెప్పి నన్నాఁ అడికిఁ దెచ్చి, నాకుఁ దిట్లు గల్పించి నాహృదయ వేదనను మఱింత చేయుదురు. అకటా! నా యుబుసుపోకకుఁ బరీవాహామే లేకున్నదే; నా హృదయము నిండి పగిలి పోవచున్నదే. హా! దేవదేవీ! హా! దేవదేవీ! (మూర్ఛిల్లును.)

లోపలధ్వని - మధురవాణీ! మధురవాణీ!- మధురవాణీ!

(ప్రవేశము—విటకంటకి)

విట:-మధురవాణీ! నీ కెంత కంఠశోవరమే. ఎన్ని సారులు పిలిచినను రాక పలుకైనను బలుకక దున్నపోతు వలెఁ బండుకొని యున్నావు. నీ కెంత దిగులు లేదే! లొత్తు! లెమ్ము. (కాలఁదన్నును.) అమ్మమ్మ! నాకాలే విఱిగిపోయె. (తనకాలిని బట్టుకొనును.)

మధు:-అమ్మా! ఏమాయె నేమాయె?

విట:-ఏమాయెనా? ఏమయిన నీ కేమిలే. అయ్యో! నా పాదము పోయె. (పాదమును బట్టుకొని బాధ నటించును.)

మధు:-అయ్యో కాలు నొప్పిపట్టెనా?

విట:-దయ్యమ! నే బాధపడుచుండ నూరక చూచుచున్నావు గదే. పాదము నొత్తరాదఁటే నే నొత్తుమని చెప్పవలెనా? (మధురవాణి విటకంటకీ పాద మొత్తును.) హా! హా! హా! ఏమే రక్కసీ! యట్లొత్తి పట్టి చంపెదవు. నన్నుఁ జంపఁ జూచుచున్నావా యేమి? విడువుము. (మధురవాణి జేతిలోని పాదమును విడువ్వచేలాగి కొని) ఎవరే నీవు నా పాదమును ముట్టుటకు? కాదే రంపెలాఁడి! ఇంటిముంగడ నలుకు మనిచెప్పిన నెక్కువగఁ బేడపెట్టి యలికి యిల్లంత యు జొచ్చు చేసి పాడుచేసినావు గదే. ఇట్టులా పని చేయుట? నీ పని కగ్గిపెట్ట. నీ విప్పుడే పోయి యింకొక సారి యలుకుము. అప్పుడును బాగుగా నలుక కున్న మఱి యొకసారి యలుకుము. బాగుగ నలుకు వఱకును నీతో నలికించెద. తెలిసెనా? పొమ్ము. ఏడ్వుము.

(మధురవాణి యేడ్చుచు నిష్క్రమించును.)

ఇంతతో దీనిపని యాయెనా. దీని నేడ్పించి యేడు చెఱువుల నీరు త్రాగించెద. (నిష్క్రమించును.)

రంగము 3. శ్రీరంగము—విప్రనారాయణు నారామ మందలి దేవదేవీకుటీరము.

(ప్రవేశము. దేవదేవి యాలోచించుచు)

దేవ:-

గీ. వానకాళ్లఁ బట్టి పైకెక్కఁగా వచ్చు;
జలదపంక్తి మీఁద నడువ వచ్చు;
ఇంద్రచాప మెత్తి యెక్కుడవచ్చు నీ
తపసి మనసుఁ ద్రిప్పఁ దరము గాదు.

అక్కటా! ఇంకేమి చేయుదును? నే నిటకు వచ్చి యున్నటికి రెండు నెలలు నిండెఁగదా. ఈవైష్ణవుని మనస్సు ద్రిప్పఁజాల నైతినే. ఈతఁడు మగవాఁడో ప్రాఁనో; మదీయ విలాసచేష్టలకుఁ గొంచెమైనం దెమ లఁడు. ప్రాఁనని మాత్ర మెట్లు చెప్పనగును? ప్రాఁకులు సహితము ప్రమదాజన విలాసచేష్టాసంఘటనలకు మోసు లెత్తి పుష్పించుఁ గదా.

సీ. ప్రాతర్ముఖమున సుస్నాతుఁడై వఱలుచో
మధురగీతంబులం బాడుచుందు;
పూఁకై ఫలపత్రపుష్పాదు లొసఁగుచో
నెఱిమించు మొగముదాల్ నెఱపుచుందు;
ఎలదోఁట లోపల మడవలు గట్టుచో
జిలిబిలిపల్కులఁ బలుకుచుందు;
తాఁ దెచ్చుకొన్న భిక్షాదనం బిచ్చుచో
వలపు వాల్చూపులఁ బఱచుచుందు;

గీ. ఎంత నెఱజాణతమున నెట్టి మోహ
దోహదక్రియ లెంతెంతొ తోరముగను
జేయఁ గల్గిన నలరొంకఁ డాయె నిపుడు;
వృక్షములె మిన్న గావె యివ్విధుకంటె?

అయ్యారే! నా చేయుపను లన్నియు రాతిప్రతిమకుఁ జక్కిలిగింతలవలె నున్నవి. ఈతని మనస్సు దృఢదారువో కర్కశగ్రావమో, కఠినతమ మగువజ్రమో తెలియరాదు. రాయైనను విమలతమ సంగీతావిష్కరణమునకుఁ గరఁగును. ఆహాహా! కఠినతమమగు వజ్రమునకంటెఁ గఠిన తరమైన దేదియోయై యుండనోపు. అయ్యో! నలువ నాకేల యీ రూపలావణ్యసంపదను గల్పించె? అడవిఁ గాచిన వెన్నెలవలెఁ, గాంతారమధ్యమున వికసించి తమ సౌరభమ్మును వమ్ముగఁ గోల్పోవు పుష్పంబుల భాతి, నా తారుణ్యలావణ్యములు నిష్ప్రయోజనము లవుఁగదా. ఓ జలజభవా! నాయందీ చెలువమును, ఈవిప్రునందీ మనః కాఠిన్యమును గల్పించిన నీ చాతుర్యహీనతకు నేనేమందును? అకటకటా! ఇప్పుడేమి చేయుదును? ఇంటికి మరలుదునా? ఏమీ!

సీ. కార్యసాఫల్యంబుఁ గాంచఁగ లేకుండ
గృహమున కేనెట్లు లేగఁగలను?
ఎపు డెప్డు వచ్చునం చెదురుచూచెడి యక్క
నేనెట్లు లీక్షింతు నీ మొగమున?

ఓరంతప్రొద్దును నూరక రొప్పెదు
విటకంటకి యెదుర నెటులనిలుతు?
లలితక వేరజా పులినతలంబుల
విహరించు నేనెట్లు వీనివిడుతు?
గీ. చేతులాపంగ నామేనఁ జెమటలూరఁ
బాదులనద్రవ్వి నీర్వోట్టి పదనుగాఁగ
నంట్లు నిలుపంగ రమ్యమై యనలుఁగొనలుఁ
బాఱు నెలదోఁట నేనెట్లు వాసిచనుదు?

నేనుమరలిన విటకంటకీ గృహమునకుఁ గదా మరల వలయు. అందేమి సుఖమున్నది? వేశ్యావృత్తివలనఁ గలుగు సుఖమున్నదందునా? దానం గలుగునది దుఃఖము గాక సుఖమగునా? కర్కశులగు భుజంగులకెల్లఁ దనగాత్రమును గరిడిగంబము గాఁగ విడిచి, వదనము నుచ్ఛిష్టకలాచిగఁ జేసి, ఉరోజములను సంత సొరకాయలుగ నొనర్చి, గుట్టు నానవిడిచి, తన శీలసంపదను నమ్ముకొను వేశ్యబ్రదుకు రోఁతగాక పూతమా? దుఃఖదముగాకసుఖదమా? ఒక్కొక్కప్పుడు మాయక్క నాకు జాలి గలుగునట్లు తన మనోవిచారమును నాతోఁ జెప్పికొను చుండెనుగదా. విటకంటకి చేయు అవ్వకును; రంపెతనమునకు, దౌరాత్మ్యమునకునుఁ దురాకృతమునకును, నోర్చుకొని, కలుషమును, హేయమును, గర్హణీయమును, ఇహపరసామగ్రీ సంపాదనమునకు దూరమును, నగువేశ్యావృత్తి నవలంబింప వలెనన్న విట

కంటకీగృహంబునం జొరవలయుంగాక, వేయేంటను దలంచిన నిక్కడియునికియే లెస్స. నేనిందే యుండిన నాయనుంగు సోదరిం జూచుటెట్లు? నిమిషంబు నన్నెడంబాయ కుండిన నాకూర్మిసోదరి యిప్పుడెట్లున్నదో కదా. ఎట్లయినను నుండనీ. గడువు గడచను దాంక నిందేయుండి పిదప నేయుపాయముననైనం బోయి చూచివచ్చెదం గాక. క్రొంజెమ్మైనం జలింపని యివ్విప్రోత్తముని నంతలో సాధింపవలయుంగదా. కానీ; నాపాలిటి శ్రీరంగధాముండే నాప్రయత్నమును సిద్ధింపం జేయువాండు. ఓరంగధామా! ఈ మునిపుంగవుని మనస్సు నాయందుం బాయునట్లు చేసి నన్నుం గృతార్థురాలింగాం జేయుమా. ఇదియె నా ప్రార్థనము, నా కుయ్యి, నామొఱ.

గీ. ఎందు భక్తాళిచేయు నాక్రందములను
విని యపారకృపావిభూతిని దనర్చి
రక్షణమొసంగు రంగేంద్ర! రంగశాయి!
నామొఱాలింపవే రంగనాథ! రంగ!

ఆ! ఎంతప్రొద్దుపోయె! మహానింద్రుండు తోంటలో నాకై యెదురు చూచుచుండును. నేంబోవలయు.

(నిష్క్రమించును.)

రంగము 4. మధుర-మదన మోహనుల యుంపుడుకత్తెల గృహము.

(ప్రవేశము-మదనమోహనులు కూర్చుండి)

మద:- అట్లయిన వాఁడూరికి నిన్ననే వచ్చియుండును. మన మోసమును వాఁడెఱుంగకుండ నింతకాలము నెట్లో గడపితిమిగదా. ఇంక వాఁడు మనలఁజూచినను భయము లేదు. మన సమాచారము విచారించుటకై వాఁడిప్పు డిక్కడకు రావచ్చును. మూఁడుదినముల క్రిందటనే వచ్చితిమని చెప్పుదము.

మోహ:- అట్లే చెప్పుదము.

(ప్రవేశము-పడుచుసాని)

పడుచు:-పెదబావా! సినబావా! మీకై యెవరో వచ్చిండారు. ఇంట్లోలేరని చెప్పుతాను.

మద:- ప్రేమసారుఁడై యుండును. వలదు; వలదు. నీ వూరక యాతని నిక్కడకుఁ బంపుము.

(సానిపడుచు నిష్క్రమించును.)

(ప్రవేశము-ప్రేమసారుఁడు)

మదన మోహనులు:- (ప్రత్యుత్థానము చేసి) మిత్రమా! రమ్ము; రమ్ము.

ప్రేమ:- మీ యునికి యెఱుంగుటయె దుర్లభ మాయెను.

మద:- హీ హ్హీహీహ్హీ! ఏమి; ఇక్కడనె యున్నాము.

మోహ:- మేము మొన్ననే వచ్చితిమి. నీవెప్పుడువత్తువా యని యెదురు చూచుచుంటిమి.

ప్రేమ:- నెయ్యులారా! దేశాటన క్లేశంబున మీరు మిక్కిలి చిన్నఁబోయినట్లున్నారు. ఇంతకాల మేయే దేశములఁ గ్రుమ్మరితిరి? దేవదేవిజాడ యేమైనఁ దెలిసెనా?

మద:- మేము మధురానగర మానాఁడే విడిచి, కాంచీపురికిఁ బోయి, విటకంటకీ మధురవాణుల తోడ దేవదేవి విషయమై చాలనఱకు సంభాషించితిమి.

మోహ:- వేశ్యావృత్తిని మాని, సోగసైపోకకై మిగులవిచారించుచున్న మధురవాణిని బలుకరించుటయె కడుకష్టతరమాయెను.

ప్రేమ:- అట్లనా!

మద:- దేవదేవీమధురవాణులకుఁ బాలితోషికంబు లొసంగిన ప్రభువుల ధనసంపన్నుల నామధేయములంగొని యెన్నో దేశంబులం జుట్టితిమి. కుంతల, మత్స్య, ఉత్కల, కళింగ దేశములఁ గ్రుమ్మరి వెదకితిమి. కాని, నీ కేమని చెప్పుదుము! దేవదేవిపొలకువ కొంచెమైనను దెలియదాయె?

ప్రేమ:- హా! దేవదేవీ! ఎందున్నావే! జగన్నాథమున దేవదేవీ విద్యాగురువగు రాధాకృష్ణభాగవతులను జూచితిరా?

మద:- వారికొఱకు విచారించితిని గాని వారూర లేరని తెలిసెను. అప్పటికి మాయొద్దనుండు సొమ్మంతయు వ్యయ మగుటచేతఁ, దిన్నఁగ నూరు చేరుకొంటిమి.

ప్రేమ:- మిత్రకార్యమునకై యెంతో శ్రమపడితిరి. కాని, నా దౌర్భాగ్యమునకు మీరేమి చేయఁగలరు?

మోహ:- మిత్రమా! నీ వెందెందు వెదకితివి?

ప్రేమ:- ఈ చోళ పాండ్య దేశంబులందలి పట్టణనగరంబు లెల్ల నన్వేషించితిని. పడిన పాటంతయు నిష్ఫల మాయె.

మద:- కష్టపాటుమనది; ఫలము దైవాయత్తము. ఇప్పటికైనను నిరాశ చెందవలసినది లేదు. మేము ——

ప్రేమ:- దాని జాడ యెఱుంగుటకై యిటీవలనే కొందఱమను ష్యులను గొన్ని చోట్లకుఁ బంపినది. దానికయ్యెడివ్యయ మును నేనె భరించుచున్నాను. సీలుకడ మీఁద దాని పొలకువ దెలియవచ్చును.

మోహ:- వయస్యా! మే మెప్పటికిని మిత్రకార్యముకొఱ కెంత శ్రమమైనను బడుటకు సంసిద్ధముగ నున్నాము.

ప్రేమ:- మిత్రులనందు మీరు చూపు ప్రేమకు నిమ్మల నే నెంతని కొనియాడుదును! భోజనము వేళ యైనది. పోయి వచ్చెద. సాయంకాలమున మరల మాటాడుదము.

(నిష్క్రమింతురు.)

## రంగము 5. శ్రీరంగము. విప్రనారాయణారామ మందలి దేవదేవి కుటీరము.

(ప్రవేశము - దేవదేవి శయ్యాతలంబుపైఁ గూర్చుండి)
(తనలో)

క. ఈ పుణ్యాశ్రమ మందునఁ
గాపుర మేనన్న కొలఁదిఁ గలుష ముడిఁగి,యు
ద్దీపితమయి నామది తన
చూపుఁబువ్వులఁ బూజసేయఁ జొచ్చెం బ్రకృతిన్.

ఇటీవలఁ గొంతకాలముగ నాజీవనదృష్టియె మాఱినది. మఱియు వైష్ణవాగ్రణి సాహచర్యము నాకు సుశిక్షాప్రదమై, తుచ్ఛమును, క్షణికమును, పాపదాయకమును, నగు యౌవనితోఁడి భోగేచ్ఛ పవిత్రమును నిర్మలమును నిశ్చలమును, గాఢమును, నగు మోహముగాఁ బరిణమించి, యాతని నాత్మీయభక్తురాలిగాఁ గైకొనవలె నని యభిలాష పొడముచున్నది. ఆహా! బ్రహ్మచర్యనిధి నుండి కొంచెమైనం దెమలని యీ వైష్ణవశిరోమణి నన్నుఁ బెండ్లి యాడునా? అంత మహాసౌభాగ్యమునకు నేనోఁచియున్నదాననా?— ఏమి? నిర్మలచిత్తమున నాచేయు భగవత్కైంకర్యము, విప్రశుశ్రూష, యివియే నానోములు. ఇవియే నామనోరథమును సఫలము చేయఁజాలినవని నాకు దృఢ విశ్వాస మున్నది. కాలగర్భమం దేముండునది యెవ్వ రెఱుఁగఁజాలుదురు?

రేపే యెన్నివిచిత్రములు గలుగఁ గూడదు? ఆరామకార్యములు సేయుటయందు మాకుఁ గల సరాగమె మోహమఁగనేల పరిణమింపఁ గూడదు?

గీ. దైవ మనుకూల మగుచుండెఁ దనరె నేని
యీప్సితార్థంబు సమకూరు టెంత తడవు?
చదలు నిర్మలం బయ్యెను జలదతతులు
శ్రీప్రగతిఁ గారుక్రమ్మి వర్షించుగాదె?

(గంట మ్రోఁగును.)

అదే! రెండు కొట్టె. ఇంక నైనను నిద్ర రాకుండునా? (పరుండును. కొంచెము తాళి కూర్చుండి) ఏమి కలయిది? మేనఁబులకాంకురంబులు నారువోసినరీతి నుప్పతిల్లినవి! ఈ యువనీ సురేంద్రుని బరిణయ మాడినట్లు గాంచితి! అంతటి భాగ్యము నా కెప్పు డలవడునో గదా. ఇటీవల నాకుఁ గలలు పడుటయే లేదు. సాత్వికాహారమును మితముగా భుజించుచు భగవత్ కైంకర్యమును భూనిర్జరోత్తముని పరిచర్యయు నిరంతరాయముగఁ జేయుచుఁ గాలము గడపుచుండ నాకుఁ గలపడుటయే చోద్యముగా నున్నది. ఇది నిశ్చలమై యుండనోపునా? ఏలొకో నా హృదయ ముప్పొంగారుచున్నది. నాకోర్కు లనలుఁగొనలుఁ బాఱుచున్నవి. (మరలఁబరుండి కొంచెము తాళి మరలఁ గూర్చుండి) ఎట్టి కలయిది! మహాహ్లాదముగ నున్నది! నాయొడ లెంకను వడఁకు చున్నది! నేనును నీ వైష్ణవాగ్రణి

యుఁ గావేరీసికతాస్థలంబులఁ బరస్పర కంఠాశ్లేషమునఁ జెలంగి వయాళి సల్పుచుండ, మా యిరువురి నడుమ నేఁటి పాయ యొకటి వచ్చెను. అది యించుక పెద్దదగుచు రాఁగ మేము పరస్పర కంఠాశ్లేషము మాని హస్తావలంబ మునుబూనితిమి. అంతి నేటిపాయ యొక్కమ్మడి, అగాధ మును విశాలమును గాఁగా, అప్పుడు మేము కరావలంబ మును మాని వేఱుపడితిమి. దూరమయితిమి. అంత నాథా నాథా! యని నేఁ బిలువ నాతఁడు నా వైపున కీఁదుచు వచ్చె. సగము దూరము రాఁగనే, యయ్యయో! యతని చేతులు సోలెను. ఆయన నీటమునుఁగఁ జొచ్చెను. అప్పు డు నాకు మిక్కిలి భయ మాయెను. అంత మెలఁకువ గంటి. ఓభయమా! నీదౌష్ట్య మెంతని చెప్పుదును! నన్ను మేల్కొలిపి స్వప్నపర్యవసానముఁ దెలిసికొనుటకు భంగ ము గలిగించితివి. ఆహా! ఎట్టిదుస్స్వప్నము? దీని యర్థ మేమై యుండును? ఈకలతుద యేమొ తెలియదాయనే. ఇంకొకసారి పరుండుదునా? స్వప్నపర్యవసానము దేలు నేమొ. (తూర్పు దిక్కు చూచి) సుప్రభాతం బయ్యె. ఇంక నాకు నిద్రవచ్చునా?

మ. పలుకం బాఱె శశాంకబింబ మదె! భాస్వత్తారకానీకకాం
తులు మాసెం, దిమిరంబువిచ్చియెకవై కూరెక్క హావార్థులు

త్కలికాకల్లోలల నాగులాడి పొలసెన్ గంధా నిలాం

కూరల్ము

అలినాదంబు శకుంతకూజితము వృక్షాగ్రంబులం బొల్చెడిన్

నదికిం బోయి స్నానము గావించెద. (నిష్క్రమించును.)

రంగము 6. విటశంటకీ గృహారామము.

(ప్రవేశము-మధురవాణి చింతతో)

మధు:- అక్కటా! అగ్రజన్మమున జన్మమెత్తి యెట్టి బ్రదుకు బ్రదికితిని!

సీ. భాస్వద్విలాస విభ్రమ కళాసంపత్తి
హేరాళముగ విక్రయించినాను;
శారద కౌముదీచ్ఛవులు చెక్కులం జిందు
మొలక లేనగవుల వెలచినాను;
కందచక్కెరతీవి నంమ సేయంగం జాలు
నధరోష్ఠమధురసం బమ్మినాను;
మోహనాస్పదమైన దేహసౌభాగ్యంబు
వెలకునై భుజియింపం బెట్టినాను;
గీ. కేవలాలీక ప్రేమంబుం గీలుకొలిపి
లజ్జ శీలంబు నభిమాన ముజ్జగించి
నన్ను నే ననకయ వంచనంబు సేసి
జాతికిని నాకు. న్నగునే సలిపినాను.

ఈపాతకమును బాయుట కేమి పాచితము? శ్రీరంగేశుని సేవ గాక మఱి యేయం దేపాపమును దొలంగింపం జాలునా?

నే నెట్లు శ్రీరంగనాథుని సేవింప నేర్తు? ఎంతకాల మిం దుండినను దద్భక్తి నాకుఁ జేకూరదు. అయ్యో! ఈముసలి దాని దురాకృతములు దినదిన ప్రవర్ధమానము లగు చున్న వే! నేనెంతని సైరించి కొందును.

గీ. నోరు నొప్పి లేక యూరక తిట్టును;
క్రోధమునను జాల గొడవ పెట్టు,
కడుపునిండఁ గూడు కుడువంగ నీయదు;
కరుణ లేని యిల్లు కార గాదె?

కారాగృహ మందున్నను నిట్టి కట్టిఁడితన ముండునా? ఈక్లేశ మున కే నెట్లు తప్పుదును? ఈ యాత్రను సదుద్బోధ యొ సంగి రక్షించు పుణ్యాత్ము లెవ్వరుఁ గలరే? ఈ వేశ్య వాటి యం దట్టివా రెవ్వ రుందురు? ఇప్పుడు నన్ను నే రక్షించుకొను మార్గము జూచికో నలయుఁ గాక. అక్క టా! నే నేమి చేయ నేర్తును? ఈ చెఱ విడిపించుకొని శ్రీరంగమునకుఁ బోదునా? ఈ చెఱ వలన నే నెట్లు తప్పిం చు కొందును? శ్రీరంగమునకు నొంటిమై నే నెట్లు పోదును? ఎట్టులో తప్పించుకొని యక్కడికిఁ బోయితిఁ బో; ఇక్కడ జరుగునంత యైన నక్కడ జరిగించుకొనఁ జాలుదునా? ధూర్తులవలన నెన్ని కష్టములకుఁ బాల్పడ వలసి యుండునో గదా. దేవదేవి కున్నంత ధైర్యము నాకుఁ బొడమకున్నదే; ఏమి నామనోవైక్లబ్యము! నా చిత్తదైన్యము! నా భావ దాస్యము! చిరకాలపరాధీనత యుండునికిచేఁ గాఁ బోలు

నాకిట్టి పిఱికితలఁపులు పొడముచున్నవి. ఔరా! చిరకాల పరాధీనత నన్నింతకుఁ దెచ్చె! నామనస్సున కవ్యవస్థితిని గలిగించి నన్ను మోహాంధకారమున ముంచినది. నాయందుఁ గలశక్తిని మఱపించినది. బాహ్యశక్తిపైఁ బూర్ణముగ నాధారపడు నట్లు గావించినది. పరాశ్రమోపజీవనమె మంచి దని భావించు నట్లొనరించినది. స్వాతంత్ర్యమే మహా నర్థముల కాస్పద మగునని తలంచు నంతటి మతిభ్రమముఁ గల్పించినది. ఆహా! పొరుగింటి పుల్లమ్మ యెన్నివిషయ ముల నాకంటె మిన్నగ నున్నది గదా. విద్యయందును వయసునందును నామె నాకంటెఁ జిన్న యయ్యును రా ట్నము ముంచుకొని నూలు వడికి పారతంత్ర్యము లేక నిశ్శంక ముగా సుఖజీవనము చేయుచున్నది. అంతకునైన నేఁ దగనా? కానీ చూచెదఁ గాక యెట్లు తగిన వాననుగానో ఓమనసా! నీవు మేల్కొనుము. నీస్వశక్తి నీ వెఱుంగుము. అప్పుడు సర్వము సప్రకాశమై మార్గములు తమంత గోచ రించును (ఆలోచించి) ఆహా! ఈమార్గ మెంత సమం జస మైనది! అట్లే చేయుదును. (నిష్క్రమించును)

రంగము 7. శ్రీరంగము విప్రనారాయణారామము.

(ప్రవేశము- విప్రనారాయణుఁడు తన కుటీరమున నిద్రించుచు, దేవదేవి తనకుటీరము వెలుపలి యరుఁగు మీఁదఁ జిటి చాప మీఁదఁ బరుండి)

దేవ:- (కూర్చుండి)

గీ. వైష్ణవోత్తముసన్నిధిం బరఁగఁ గల్గి
నను, గటా వ్యర్థురాలనై తిని గరంబు.
వీఁటి యిరుగొప్పలును నెక్కు-పెట్టఁబడక
కొప్పుకటి నుండి వ్రేలాడు గొనయ మట్లు.

ఈతనివలని యిట్టి వియోగంబె నాకు స్థిరమగునో, లేక యెప్పటికైన నితనిఁ జేపట్టఁ గలుగుదునో?

హా! ఏమిసేతును? ఇంతప్రొద్దయినను గంటికి నిద్ర రాదాయె. ఆ! ఎంత యుక్కగా నున్నదీ రేయి! ఇదే పశ్చిమ దిఙ్మండలంబున మెఱపులు మెఱయు చున్నవి. అహాహా! చల్లని గాడ్పులు వీవఁ జొచ్చె. హృదయాహ్లాదకరంబగు కమ్మనెత్తావి వొడము చున్నది! దూరమున వర్షముగురియు చుండును. (మింటఁజూచి) ఓహోహో! పర్జన్యుఁ డభ్రగజంబుల నెక్కి తన విద్యుదంకుశాభిఘాతములతో వానిం దోలుచు నాడంబరమున వడివడి గగనభాగంబు నకు నడతెంచు చున్నవాఁడు. ఆతని రాకకై వెదచల్లఁ బడిన సిత పుష్పములా యనఁ జెన్నారు తారకలు గూడఁ దద్గజ యూధాగమంబున సరగున మఱుఁగు పడెను ఆకాశ మంతయు నెంత శీఘ్రముగాఁ గాఱుక్రమ్ముకొనియె! గాడ్పులు తోడ మెఱుములును నఱుములును విజృంభింప సాగె. ఆ! ఈ బాహ్య సంక్షోభము నా యాంతర సంక్షోభమును నను కరించు నట్లున్నది. ఇదే పొటపొట పెంజినుకులు పడుచున్నవి. గుడిసెలోనికిం బోయెదఁ గాక. (లోనఁబ్రవేశించును)

అకటకటా! నాయుటజం బురియు చున్నది! నేనిందు వేసిన యీచిత్రపటములను, వస్త్రాదికములను దీసికొని పదిల పఱచెద. (కుటీరమందుఁ దగిలించి యున్న పటములను దీసి వస్త్రములతోఁ గూడ మూటగట్టుకొని యాశ్రమములో కుటీరము వెలుపలికి వచ్చును. వెంటనే కుటీర ముత్పాటిత మగును). అయ్యయో! ఈ పిడుగు ఝుంఝూ మారుతంబునకు నా యుటజం బుత్పాటిత మయ్యె. నాశరీరంబు తడియుచు నచ్చె. ఈ మెఱపుల వెలుతురున జొంపమై యున్న యీరావిచెట్టు మఱుగునకుఁ బోయి యందు నిలిచెదఁగాక. (ఆనమూటను గైకొని చెట్టుచెంతఁ జేరును. లోపలఁ బిడుగు పడుధ్వని కాఁగా దేవదేవి భయమున నణఁకుచు) ఎంత భయంకర మైన యశనిపాత మిది!

విప్ర:-(దిగ్గున లేచి కూర్చుండి)

శ్లో. అర్జునః ఫల్గునః పార్థః కిరీటి శ్వేతవాహనః
బీభత్సు ర్విజయః కృష్ణ స్సవ్యసాచీ ధనంజయః

ఆహా! ఏమి గర్జాడంబర మిది! సమీపముననే పిడుగు పడి యుండును. కుంభద్రోణముగ వాన కుఱియు చున్నది.

సీ. నింగి యవిసి కాఱుభంగిని వర్షంబు
ఘోరధారాకృతిఁ గుఱియఁ దొడఁగె;
పెళిలు పెళిల్లని భీతిప్రదంబుగఁ
బిడుగు తండంబులు పడఁదొడంగె;

గర్జార్భటులు మింటఁ గదుకొని ఘూర్ణిల్ల
నార్తజాంతవరవం బతిశయిల్లె;
వర్షోదకంబు కాల్వలు గట్టి పాఱుచో
జనియించు మర్మరధ్వని చెలంగె
గీ. ప్రసవములు పండ్లు పిందెలు రాలి పడఁగఁ
జోక నించెడు లతలు చీకాకు పడఁగఁ
దల్లి వేళ్లతో వ్రూఁకులే పెల్లగిలఁగ
గాడ్పువీచు మహోత్పాతకరము గాఁగ.

దేవ:-అక్కటా! వ్రూనియాకుల మీఁది నీరును బైజాఱిసాగె. వాననీటి వెల్లువయు నతిశయించి కాళ్లక్రిందికి వచ్చె. ఈ తీవ్రమారుతము వలన శీతార్తియు నధిక మయ్యె. ఇంక నెందుఁ బోయినఁ దలదాఁచు కొనుట కింత వెచ్చనిచోటు లభించును?

చ. మునివరుఁ బల్కరించి తలు
పుం దెఱవంగను వేఁడి కొందునా?
మును లతికోప సంయుతు ల
మోఘ వచస్కులు తాళలేక న
న్నినుక మొయిల్ శపించి కడుఁ
గీడ్పడఁ జేసిన నష్టమెవ్వరీ
"చినుకున కోర్చి యుందున వ
సించుట మేలు" తలంచిచూచినన్.

విప్ర:-మారుతం బింకను దీవ్రతరముగ వీచుచున్నది! అయినను వాన వెల్లువసూప దయ్యె. ఎలదోఁటగతి యేమయ్యె నో? మొయిలుమొత్తమ్మ లింకను నాకసమును గప్పి యున్నవో లేక పలుచఁ బాఱు చున్నవో తలుపు దెఱచి చూచెదఁ గాక. (తలుపు దీసి చూచి) కాఱుక్రమ్మి జలదపటలము కొంచె మైనను బలుచఁ బాఱ కున్నది. ఆహా! ఎంత ఖం చెంత మించు! అయ్యో! పాపము! దేవ దేవి తనకుటీరం బుత్పాటితంబు కాఁగ వాన గొట్టు నం జిక్కి రావియుండ నిలిచి యున్న దే! (బిగ్గరగా) దేవదేవీ! దేవదేవీ! ఇందురమ్ము. వానకు సీతునకుఁ జిక్కి పొగిలెద వేల? ఇందు రమ్ము.

దేవ:- (తనలో) ఆహా! వసుధామర వల్లభుండు నన్ను రమ్మ ను మన్నవాఁడు! ఏమి నాభాగ్యము! శ్రీరంగధాముఁ డు నాకభ్యుదయంబు చేకూర్చునా? (ప్రకాశముగ) వైష్ణవ శిరోమణీ! ఇదేవచ్చితి. (మాటలతో విప్రనారా యణుని కుటీరములోనికిఁ బ్రవేశింపఁ దలువు మూయఁ బడును.)

విప్ర:-భక్తురాలా! నీ యుటజం బుత్పాటితం బై యుండ న న్నొక్కసారి పిలిచి యుండ రాదా? మదీయ దీప్యమాన గేహ ముండఁ జెంజడిం జిక్కి పొగుల నేల? వజవజ వణఁ కుచున్నావు. కడుఁ దడిసితివి. కొమ్మా నాకాటిని. ధరిం పుమా దీనిని. (కాటినిచ్చును.)

దేవ:-మహాభాగ్యము. (శాటిని గైకొని ధరించి తనలో) ఏమి నాయదృష్టము! ఈ యువతీసురశిఖామణి తనశాటిని ధరింప నిచ్చి నాఁడు!

విప్ర:-భక్తురాలా! తలుపుకడ జల్లునం దుండ నేల? ఇటు రమ్ము. ఇదే కుశాస్తరణము. తడికాళ్లతోఁ ద్రొక్కెదవు సుమా. ఇందు వేష్టువ లున్నవి. ఇచ్చట బహువిధ గ్రంథ ములున్నవి. అయ్యోడఁ బెరుమాళ్లున్నారు. చోటులేదు. ఇక్కడఁ జేరువనే యుండుము.

దేవ:-(సమీపమునకుఁ బోయి యుండి) నైష్ఠికేంద్ర! ఈ చలి కతంబున నిద్దుర రాదు. కొన్ని లీలాగీతంబులఁ బ్రొద్దుపు చ్చెదఁగాక.

విప్ర:-పరమ సమ్మతము.

దేవ:- (మంజరీ ద్విపద)

ప్రేమంబు భువిలోనఁ ద్రివిధమైయుండు
నాత్మప్రేమమె యందు నాద్య మై యొప్పు;
ఆత్మరక్షణ చణం బగునాత్మప్రేమ
ప్రాణులకెల్ల నవశ్యమై యుండు.
నిఖిలభూతము లందు నెక్కొను ప్రేమ
ధరణి ద్వితీయ మై తనరుచు నుండు;

ఈ ద్వితీయ ప్రేమమే మానవులకు
ధర్మార్జనంపు సాధన మయియుండు
పరమేశు మీఁద ను వఱలెడిప్రేమ
పుడమిఁ దృతీయమై పొలుపారు చుండు;
ఈ దివ్యప్రేమమే యీశ్వరభక్తి
యన నొప్పి భక్తాళి కానంద మిచ్చు.
మూఁడుపాయలు గాఁగఁ బొదలు నీప్రేమ
మొక్కయాశయ మందె యుద్భవం బంది
పూతమై శ్రీదమై భువిఁ బ్రవహించి
ప్రాణిజాలము నెల్లఁ బాలించు చుండు.

విప్ర:-కలకంఠీ! నీ మృదుగీతరాగము మిక్కిలి మధురము. ఇంకొకటి పాడుము.

(మంజరీ ద్విపద)

దేవ:-

హృదయమున్ కొమరారు నొఁదోఁట లోనఁ
జిగురించి గని యెడి చిన్నపాదునను
వలపునాఁ బరఁగెడి వల్లి యొండుండు;
అలతీవ వెలఁది వెన్నెల లీను చుండి
వనమెల్ల వెలిఁగించి తనరారు చుండు.
త్రిదివంబు నందుండి దేవతల్ దాని
నందు నాఁటిన యట్లులనుకొంద్రు జనులు.
ఆశయ దానికి నంబువై ప్రోచు;

తేఁటులె పరఁగును వలిమంచు గాను;
ఆశ్లేషణంబున నారొందు నదియు;
ముద్దుల పూపునఁ బుష్పాలం బూచు.
దానిపువ్వులు సొంపుఁదావుల నీని
యందమై చందమై యొలరారుచుండు.
వలపుఁదీఁగియ కూడి బ్రదుకంగఁ దగిన
పల్లవరాగసంపన్నమై వటలు
పున్నాగమాయుండఁ బోలుపార లేమిఁ
గను సిరాశ్రయ మను మదియుఁగా నుండు.
ప్రసవాస్త్రుఁ డనెడి యా వనపాలకుఁడు.
కరుణ యింతయు లేక కాటియు వెట్టు.
అలతీవ రహి బాహువుల నెత్తి తనదు
పల్లవాంగుళముల నల్లఁ గదల్చి
యెలుఁగులోనడఁగఁ దాఁ బలుకు నిప్పగిది.
"పున్నాగమా! ప్రాపు ముదమూర నిమ్మ;
కన్నతీవను వేగఁ గాపాడు కొమ్మ."

విద్రః- కోకిలవాణీ! నీ గీతమతి మనోహరముగ నున్నది. (తనలో) ఈగానలహరి నాహృదయక్షేత్రంబునఁ బ్రవహించి నాకోరిక లీకలెత్తఁ జేయుచున్నది. గీతమందలి భావము నాకు దోహదకార్య మొనరించు చున్నది.

దేవ:- అవనీ సురనాథా! నన్నుండ నియమించిన యుటజంబు లోనికిఁ దామెప్పుడును రానేలేదు; నే నాలిఖించిన యీ చిత్తరువులతో దాని నింపుగ నలంకరించి యుంటిని. వీని నిప్పుడైననింత తిలకింపుఁడు. (మూటవిప్పి పటము లొక్కొ క్కటి యెత్తి చూపుచు) మకరిచేఁ బట్టఁబడిన గజేంద్రుని మొఱాలించి, తత్ప్రాణరక్షణ పరతంత్రుఁడై శ్రీవిష్ణువు ప్రణయ కలహప్రోద్ధత శ్రీరమణీమణీ కుచోపకి చేలాంచల మైనను విడువక యెటు పోవు చున్నాఁడో.

విప్ర:- ఇందిరారమణునకు భక్తులపై నెంతప్రేమ!

దేవ:- (మఱి యొకపటము దీసి చూపుచు) ప్రాలేయాచల పాదభూభాగంబునఁ బార్వతిఁ దనకై చేయు తపస్సునకు మెచ్చి శంకరుఁడామెకు సాక్షాత్కరించి "రమణీ! నేనన్యుఁ డఁగాను నీనాఁడనే; నీతపస్సున కమ్ముడు పోయితి. నన్నేలు కొమ్ము". అని యెట్లు వేఁడుకొను చున్నాఁడో చూడుఁడు.

విప్ర:- (చూచును.)

దేవ:- (వేఱొక పటము చూపుచు) కశ్యపపుత్రుఁడు మడువున జలక మాడు సూర్వాసి నెట్లు మోహావలోకనములఁ గాంచు చున్నాఁడో యవలోకింపుఁడు.

విప్ర:- (చూచుచు నాలోచించును.)

దేవ:- (ఇంకొక పటము చూపుచు) యమునా తరంగిణి దాఁటుచు వశిష్ఠపౌత్రుఁడు పరాశరుఁడు పడవ నడుపుయోజన

గంధిని దృష్టితీరఁ దనకన్నుఁగవతో నెట్లాలింగనము చేయు చున్నాఁడో తిలకింపుఁడు.

విప్ర:- (చూచుచు దీర్ఘాలోచన సేయుచుండును.)

దేవ:-(వెండియు నొకపటముదీసి) ధృతి మాలి మాలినీ పులిన తలంబున గురువింద పొదలో నప్సరస్తరుణీమణి యగు మేనకలావణ్యసరస్సులో నీఁదులాడి యానందించు విశ్వామిత్రు నేత్రమీనంబులం గనుఁగొనుఁడు.

విప్ర:- (తనలో) ఇట్టి మహానుభావులే భామినీమోహాతల్ప రులై యుండ నేనెంతవాఁడను? (ప్రకాశముగ) రమణీ! ఈ పటములు గడుమనోహరములు.

దేవ:- (తనలో) రమణీ యనుచున్నాఁడు! పర్జన్యుఁడువర్షముతో భూపురంధ్రీగ్రీష్మతాపమును నణచినట్లు నామనోజతాపమీ విప్రోత్తముఁడు తీర్చునట్లున్నది. హా! యమా! ఆకాటము మానుమా. (విప్రనారాయణునిపైఁ జూపులునిగుడించు చుండును)

విప్ర:-(తనలో) మహనీయమగు విష్ణుమాయావిలాస మే మో కాని, నా మనఃప్రసూనము హఠాద్వికాసము నొంది వలపుల వెదజల్లుచున్నది! ఈమె కన్నియ; స్వతంత్రురాలు. నేనును బ్రహ్మచారిని. మాకు సంయోగ మేల కూడదు?

మ. పొలుపారంగ లతాంగిభక్తియును నో
ర్పు న్నేర్పు వీక్షించినన్,

విలసద్రూప విలాసవిభ్రమకళా
నిర్ణిద్రసౌభాగ్యముం
దిలకింపన్, మృదుదివ్యగీతకళనో
స్మేమంబు భావించినన్,
దలిరుంబ్రాయపు ముద్దుగన్నియ పయిన్
వ్యామోహముంగల్గెడిన్.

(ప్రకాశముగ) మనోహారిణీ! నీ కాటుకకన్నుల నాడి నీల జలదావృతం బగు నాకాశము నుండి వెడలు వాల్చూపు లనియెడు మెఱపులకు నాహృదయచకోరము తత్తరపడి తనగూఁటిని విడచినది. కోమలీ! నీ యనురాగపంజరమున దాని నుంచి కాపాడి నన్నుఁగృతార్థుని జేయుము.

దేవ:- (తనలో) ఈ పలుకులు వినుటకు నేనెంతధన్యురాలనో కదా. (ప్రకాశముగ) భూసుర నాథా! మీవచోమృతసారము సందేహాతప్త మగు నాహృదయము పైఁబడుటఁ జేసి యందు భావధూపములు సాంద్రముగఁబొగలు నాచిత్తా వరణము నంతయు గుబులుగొన్నవి.

విప్ర:- వానికింత తెలికి రానిమ్ము. తత్ పరిమళమును నేనును ననుభవింతును.

దేవ:- ధరామరనాథా! ఎప్పుడు మీయురువడికి శాశ్రయించి తినో యప్పుడే నాసర్వస్వమును దమకు ధారపోసిన దానను. నా జీవనము భవదీయ వాంఛిత ఫలార్పణంబున వఱలఁ జేయుట చేత, నేను గడు ధన్యురాలనగుదును.

కాని నే నొకటి వేడు దానను. ఈయూరు క్షణభంగురమును హేయమును నగు కామమున నన్నుఁ గోరక, ఆజన్మమును అవిచ్ఛిన్నముగ వలలు కావన మగు మోహమున నన్నుఁ బరిణయ మాడ వలెనని.

విప్ర:- కాంతామణీ! గాంధర్వ వివాహ విధినే నిన్నుఁ బరిగ్రహించెదను. అదియే నా యభీష్టము.

దేవ:- మహాప్రసాదము. (తలుపు తెఱచి చూచి)

గీ. అదె! విభావరీగర్భగోళాంతరమున
సూర్యుఁ డెదురు ప్రాభాతిక సూర్యరుచులు;
నదికి మన మేగి మంగళస్నాతులమయి,
పాణిగ్రహణంబు గాంతము భవ్యలీల.

విప్ర:- అట్లే చేయుదము. (నిష్క్రమింతురు.)

రంగము-౫. కంచికిని శ్రీరంగమునకును నడుమ నుండుదారి.
(దూరమున నొకగుడిసె. అందునున్న దీపము వెలుఁగు చుండును. తోటకాఁ డొక వట్టిగంపను దీపమున కాఁపుగా దగ్గర నుంచుకొని దుడ్డు లెక్క పెట్టు చుండును.)

తోట:- మాసామి నా కీయాల మూడ్రూపాయల వండ్లించింపాడు. వాటి నమ్మితే వచ్చిందేది ఇదొక్కరూపాయి, ఇదొక్కరూపాయి, ఇదొక్కరూపాయి,- మూడ్రూపాయలు. పైనరుండేవిలాభం. ఒకటి, రెండు, మూడు,

నాల్గు, అయిదు, ఆఱు, ఆఱున్నొకటి, ఎన్మిది, తొంబిది, పాది. పదణాలువచ్చిండాది. దినాం ఇంతలాభం వత్తే నా పెండ్లానికి పుట్నింటి నుంచి వచ్చేయాలకు మెళ్లోనికి సొమ్ము చేయిత్తాను.

(ప్రవేశము: ప్రేమసారుఁడు ప్రయాణవుమూటతో)

ప్రేమ:- ఎవరయ్యా! గుడిసెలో నున్నవారు?

తోఁట:- (దుడ్డును సంచిలో వేయుచు) నే న్దోఁటకాఁపు. ఎవగయ్యా నీ పీయాలకా వొచ్చిండావు?

ప్రేమ:- అయ్యా! నే నొక బ్రాహ్మణుఁడను. దూరప్రయాణము వలన బడలియున్నాను. ఇక్కడఁ బండుకొన నగునా?

తోఁట:- నాకా డేముండా దయ్యా. తోఁటాతని అడగాలె.

ప్రేమ:-అయ్యా! నేనే తోఁటయజమాను నడిగెదను. నీవు నావెంటఁ గొంచెము వచ్చి యాతని యింటికి దారి చూపుము. నా యొద్ద నుండు నాహారము నిత్తును.

తోఁట:- (తనలో) ఈతన్కి శానా ఆఁకలవుతా వుండాది. పండు కొండచ్చిత్తే నాపెండ్లామ్మెళ్లోని కార మిత్తాడు. పానం పోయ్యేటంత ఆఁక లన్యాయాల యేమైనా యిత్తాడు ఒక సావుకారి అడవిలో ఆఁకల్తో నడల్లేక సెట్టుకాడ పడుంటే ఆతన్కి పది అంటిపండ్లిత్తే ఆతని నాకు బంగారుంగ్రం దనుచేశాఁడు కాదా. అట్లే ఈతని.

ప్రేమ:- అయ్యా! యేమి యాలోచించు చున్నావు? ఈదీపము దీసికొని నావెంట రమ్ము.

తోఁట:- సామీ! తోఁటాతనిల్లు తోఁటాత ఉండాది. నోవలో కంపలు, ముండ్లు, పాములు, తేళ్లు వుంటాయి. నాన పోయి వత్తాను లే సామీ. నీ దీపం కాడ కూసో.

(నిష్క్రమించును.)

ప్రేమ:- ఇక్కడ నేఁ బండుకొనటకుఁ దోఁట యజమానుని యనుజ్ఞ గావలెనా? ఈ యారామస్వామి కనుఁ గట్టిఁడిగాఁ దోఁచు చున్నాఁడు. వీఁడును దండి యిస్తు నన్న యాసతో నాతని నడుగఁ బోయి నాఁడు. చెడిపోవ నన్ను యీ యాయు పాహారమును మూటలో నుండి తీసియుంచి వీఁడు వచ్చిన తోడనే యిచ్చెదఁ గాక (మూటవిప్పును.)

(పునఃప్రవేశము తోఁటకాఁపు)

అయ్యా! తోఁట యజమానుఁ డేమనెను?

తోఁట:- ఏమంటాఁడు! నా యెత్తె సెసె బాబయ్యా ఆఁకలి కొన్నాతని నచ్చింటాఁడు. ఈటికి రాలేఁడని సెప్తే, ఈపండ్లు కొండబోయి యిమ్మన్నాఁడు. సామి! ఈటిని దిని యీడె పండుకో. తెల్లారే యాలకు నాన లేప్తాను.

(అనఁటిపండ్లిచ్చును.)

సామి! ఇత్తా సంటివే అరం.

ప్రేమ:- ఇదిగో! తీసికొమ్ము. (ఆకు లోని యుపాహారము నిచ్చును.)

తోట:- ఏమయ్యా? నీవప్పు డార మిత్తానంటివే. అదేయ్యా! ఈసద్ది నాకేం కాయాలె.

ప్రేమ:- ఇది చల్లిగా దయ్యా! లడ్డులు.

తోట:- లడ్లొద్దు. గిడ్లొద్దు. ఆరమిత్తానంటివే. నా పెండ్లాం మెళ్లోనికి కావాలె. అదీవయ్యా!

ప్రేమ:- (తనలో నాశ్చర్యముతో) ఆహా! నేను పండుకొనవగు నా యన ఫలము కొనుటకు దొరకునా యనియుఁ నాహార మిత్తు ననిన నా యొక్క హార మిత్తు ననియు నర్థము చేసి కొన్నాఁడు. ఆయ్యో! నాపలుకుల కెట్టి యనర్థములు చేసి కొనెన!

తోట:- ఏమయ్యా! వూర కుండావు. ఏం బాపనాతనయ్యా నీవు? అడి తప్తావా? సూసుకో-(కోలనూపును)

ప్రేమ:- అయ్యా! క్షమింపుము. ఆహారము నిత్తు నంటిని గాని హారము నిత్తునని చెప్ప లేదు. నాయొద్ద హారమే లేదు. నేనొక యాత్రికుఁడను. బీదవాఁడను. వీనిం గైకొని నాకీ రాత్రి పరుండ నింత చోటిచ్చి రక్షింపుము. (చేతిలో రూప్యము లుంచును.)

తోట:- పెద్దోణ్ణాట నానూర కైనాను. లేకుంట... నీవీ మూల్లో ముసుక్కో. నేనాడ పండుకుంటాను. (ఇరువురును బడుకొందురు.)

(ప్రవేశము: మధురవాణి పురుషవేషమున)

మధు:-

చ. పరిసర మందు నెయ్యెడను
బల్లియ యెఱియు నిల్వ లేమిచే,
దెరువిది పోవఁబోవ నది
దీర్ఘము నై మహీతలోగ్రమయ్యె,ని
ర్గతి గమనశ్రమం బడరెఁ
దగ్ధపదంబులు తొట్రుపాటునం
బొరసె, నికట్టు లీభయద
భూములఁ దాటఁగ నోర్చు దాననో.

వెలికిఁ బురుషవేషమున్నను నాయాంతరము సహజ మగు నా స్త్రీస్వభావమును వెల్లడిచేయు చున్నది! వెలుతురు పోవుట తోడ నాకించిత్ ధైర్యమును నప్పుడే నన్ను వీడె. హా! ఇప్పుడు నేనేమి చేయుదును? అదే! ఆయెడ మిన్కు మిన్కు మని జ్యోతి వెలుఁగు చున్నది. అయ్యది గృహమై యుండ నోవు. అందుఁ బోయినఁ గొంత నెమ్మదియు, విశ్రమించుటకుఁ జోటును దొరకవచ్చును. (నడచి) ఇదె కుటీరము ఎవరయ్యా! ఇక్కడ నుండునది?

ప్రేమ:- (ముసుఁగులోనుండి) నీ వెవరయ్యా!

మధు:- నే నొక బాటసారిని. కాల్నడ దీర్ఘప్రయాణము చేసి మిగుల డస్సియున్నాఁడను. నలదాఁచుకొనుట కిక్కడఁ దావు దొరకునా?

ప్రేమ:- తలయే యేల? సమస్తమును దాఁచుకొనుటకుఁ జోటున్నది. కాని యీపరున్నవాని నడుగుము.

మధు:- నీవు చోటిచ్చిన నతఁడేమి వద్దనునా?

ప్రేమ:- అయ్యా! నేనును నీవలెనే బాటసారిని. ఇతని యను జ్ఞ వడసినచో నేను నిచ్చటఁ బరుండి యున్నాను.

మధు:- (తోఁటకాఁపును సమీపించి) అయ్యా! అయ్యా!

తోఁట:- అయ్య కొయ్య. ఏం బాపనయ్యా! నిద్ర పోయ్యే వాణ్ణి పూరికె సతాయిత్తావు. పూరకే ముడుక్కో..

మధు:- అయ్యా! నేను పేూక బాటసారిని. నేనిక్కడఁ బరుండుదునా?

తోఁట:- ఊఁ ...

ప్రేమ:- అయ్యా! వాఁడు మంచి నిద్రలో నున్నాఁడు. వానిని మేలుకొలిపినఁ గోపపడును. అందె పరుండుము. వాఁడు లేచి యడిగిన సమాధానము చెప్పెదము.

(మధురవాణి ముసుఁగు పెట్టుకొని పరుండును.)

అయ్యా! మీ దేయూరు?

మధు:- (ముసుఁగులో నుండియె) కాంచీపురము.

ప్రేమ:- (ముసుఁగుదీసి కూర్చుండి) ఎక్కడఁ బోవుచున్నారు?

మధు:- (ముసుఁగులో నుండియె) శ్రీరంగమునకు బోవు చున్నాను.

ప్రేమ:- ఏమి నిమిత్తమై పోవు చున్నారు?

మధు:- (ముసుఁగులో నుండియె) నా హాదకి యెక్కడనున్నది! ఆమెను జూడఁ బోవు చున్నాను.

ప్రేమ:- కంచిలో మీ రెవ్వరు?- అయ్యో! మీ పేరేమి?- అహా! ఈతని కెంత శీఘ్రముగా నిద్రవచ్చె. నా పాపకంటికి నిద్ర రాదె! హా! దేవదేవీ! నీకై నేనెంత యలమట పడుచు న్నాను! నీకు దయ రాదాయెఁగా!

ఉ. ఆసలు పెంపుఁగాంచి హృద
యం బలరారఁగ నిన్నుఁగూడి నె
న్నో సుఖలీలల న్వెలయ
నుండఁగ గోరుచునున్న నన్ను న
య్యో సరసీరుహాక్షి! విర
హోజ్జ్వలతాపము పాలుచేసి యి
ట్లీ సుమసాయకార్తి నల
యించుచు వ్రగ్గఁగఁ జేయుదానవే.

ఓ మధురవాణీ! నీవైన వానియునికిఁ దెలిపి నన్ను రక్షింప వైతిగా. హా! దేవదేవీ! దేవదేవే! (ముసుఁగు పెట్టి పరుండును.)

మధు:- (ముసుఁ గించుక తొలఁగించికొని తనలో) ప్రమాద మైనది. ఇతఁడు ప్రేమసారుఁడు. నన్ను గుర్తించిన మహా ప్రమాదమగును. (ముసుఁగు పెట్టి పరుండును, నొకనాగుఁ

బాము వచ్చి మధురవాణి యంగుష్ఠమును గఱచును. ఆమె దిగ్గునలేచి పాముం గాంచి) అయ్యో! అయ్యో! పాము గఱచె. చచ్చితి; చచ్చితి!

(ప్రేమసారుఁడును దోఁటకాఁపును దిగ్గున లేతురు. ప్రేమసారుఁడు దుడ్డుకఱ్ఱను గొని పాముం గొట్టి చంపును.)

ప్రేమ:- ఇది చచ్చినది.

తోఁట:-సావలే దయ్యా! (అని ప్రేమసారుని చేతియందలి దుడ్డుకఱ్ఱను దానిఁ దీసికొని మఱిరెండు మోఁదులుఁ మోదిఁ కఱ్ఱమొనతో నెత్తి దానిని బాఱవైచును.)

మధు:- (కాలిబొటనవ్రేలిని బట్టుకొని) అయ్యో! ఇక్కడఁ గఱచె. రక్తము వచ్చుచున్నది. (ప్రేమసాఁరుడు పట్టుకొని కాలికి గుడ్డలతో రెండు కట్లు గట్టును.)

ప్రేమ:-అయ్యా! మీరు భయపడవలసినది లేదు. నేను జికిత్స చేసెదను. (తోఁటకాపుం జూచి) అయ్యా! నీదగ్గఱ కత్తి యున్నదా?

తోఁట:-ఉండాది. మంచి పదనైన కత్తి. (అని తన మొలలోని చుఱుకత్తి నిచ్చును. ప్రేమసారుఁడు కాట్లు పడిఁచోటఁగోసి రక్తము వెలువరించును.)

మధు:-నాకెట్టులో యున్నది. (వణఁకును.)

ప్రేమ:-కాట్లు లోఁతుగా లేవు. అయ్యా! జడిసికొన వలదు.

(అని తన మూటలో నున్న మణిని దీసి గాయమున కంటిం
చును.)

తోట:-ఏందయ్యా! ఆరాయి ?

ప్రేమ:-అది విషము పీల్చుమణి. అయ్యా! బాధ యున్నదా?- ఇతఁడు జన్మపున మూర్ఛితుఁడైనవాఁడు. అదే యరుణోదయచ్ఛాయ లాకాశ మార్గమున వ్యాపించుచున్నవి. బండిని బాడుగ చేసికొని ఈ సర్పదష్టుని దోడ్కొని కంచికిఁ బోయెదఁ గాక. (తోఁట కాఁపుతో) అయ్యా! బాడుగ యిచ్చెదను గంచికి బండి కట్టెదవా?

తోట:-కట్టుతాను సామీ! కాని బాడుగ...

ప్రేమ:-న్యాయముగ నీ వడిగినంత యిత్తును. బండి కట్టుకొని త్వరగా రమ్ము.

తోట:-ఇప్పుడె వత్తిని సామీ! (తోఁటకాఁపు నిష్క్రమించును.)

ప్రేమ:-ఈతని నెక్కడనో చూచినట్లున్నది. ఎంతజ్ఞాపకము చేసికొన్నను స్మరణకు రాదు. నోట నురుగు గ్రమ్ముచున్నది. (తుడిచి ప్రక్కపొరలించును. అప్పుడు పాగ యూడి పడును.) ఆశ్చర్య మాశ్చర్యము! ఈ విగ్రహము పురుష విగ్రహ మనియె భావించి యుంటిని. ఇది స్త్రీ. (పరికించి చూచి) ఔరా! ఇది మధురవాణి! దేవదేవి ప్రియసోదరి. పురుష వేషమున నుండుటచే నప్పుడ గుర్తింప లేనైతిని.

తనసోదరిం జూచు నిమిత్తము శ్రీరంగమునకుఁబోవు చున్నట్లు గదా యిది నా కెఱింగించె. అయిన దేవదేవి శ్రీరంగము నందె యుండునా ? అందుండ కున్న నిమ్మగువ యెక్కడ కేల ప్రయాణమై వచ్చును ? ఆహా! ఒడిలో బిడ్డ నిడికొని యూరెల్ల వెదకి నట్లాయె!

ఇది నాప్రియురాలి సోదరి గావున నాకును నాప్తురాలె. దీని నెట్లయినను నీయాపదనుండి రక్షింపవలయును. (నాడి చూచి) నాడీస్పందనము కొంతవఱ లేదు. ప్రాణభయ మేమియు లేదు. మఱి విషముఁ బీల్చుచున్నది. సూర్యోదయ మగువేళకుఁ దెలివి రావచ్చును. అప్పుడు దీనినడిగి దేవదేవీ వృత్తాంతముం దెలిసి కొందును. కాని నాకిది చెప్పునా ? ఏల చెప్ప కుండును? ఎట్లు చెప్పకుండును ? (బండిచప్పుడువిని) అదె బండి వచ్చుచున్నది. తలపై నుష్ణీష మట్లె యుంచెద. (పాగను దలపై నుంచును.)

తోఁట:-(ప్రవేశించి) సామీ ! బండి తెచ్చిండాను.

ప్రేమ:-అయ్యా! కొంచెము సాయము పట్టు. పాము గఱచిన చోటఁ దాఁకెదు సుమా. (ఇద్దఱును మధురవాణి నెత్తి కొని పోవుదురు.)



# విప్రనారాయణ నాటకము

చతుర్థాంకము.

రంగము 1. విప్రనారాయణుని నారామ మండలి యొకభాగము.

(ప్రవేశము: దేవదేవి విప్రనారాయణులు.)

దేవ:-(పైనఁ జూచి) ప్రాణనాథా!

గీ. వృక్షశాఖాళు లెత్తునఁ బెనఁగు కతన
నల్ల బమ్మయి శ్యామమై చల్లనయిన
వృక్షవాటి యీ మధ్యాహ్న విహారిణార్థ
మగుచు హాయిఁ గూర్చు మదీయ స్వాంతమునకు.

విప్ర:-(క్రిందఁజూచి) ప్రేయసీ! ఇటు చూడుము.

గీ. సుఖము దుఃఖమన్ గలుగు వస్తువులలోన
నెద్దియును గాని యొకచోటఁ బెక్కుకాల
ముండ దనురీతి నియ్యెడ మొలకొనిన
యాతపచ్ఛాయలు చలన మందుఁ జూడ్వే.

దేవ:-మిక్కిలి రమణీయము. మనోవల్లభా! ఆకదళీ గృహము
నకుఁ బోవుదము.

విప్ర:-పోవుదము. (ఇరువురును గదళీగృహమునకు నడుతురు.)

దేవ:-ఈ కదళీగృహమునకు మనమిరువురము గలసి మున్నె
ప్పుడును రాలేదు. మనవివాహ మైన మఱునాఁడు నేను
వింత విన్నాణములుగఁ గూర్చి యొసఁగిన ప్రసూనమాలి

కలం గొని మీ రాలయమునకుఁ బోయియుండ నేనీ వేదిక రచించితిని. దానిమీఁద సించుక కూర్చుందుదము.

(ఇరువురును వేదికపైఁ గూర్చుందురు.)

విప్ర:-దీని నెంత యందముగ రచించినావు! నీ నిర్మాణ కౌశల మెంతయు శ్లాఘనీయము.

దేవ:-నాయొడలి మీఁది యీసొమ్ములను నే దాఁచిన దా మట్టి తొఱ్ఱలోనె.

విప్ర:-దేవదేవీ! నీవు కడుజాణవు.

దేవ:-మీ రావేసఁ బాదులు ద్రవ్వుచుండ మిమ్ము నే మొట్ట మొదటఁ గాంచిన దారావి చెట్టునీడ నుండియె.

విప్ర:-ఆరావి మనకు మహోపకారము చేసినది.

దేవ:-నాథా! మన మాందాకి నే పోయి సరస్తీరముం జేరుదము.

(ఇరువురుఁ గైయూఁతగొని నడతురు.)

విప్ర:-దేవీ!

గీ. అకసముఁ గ్రమ్మికొని యున్న యలసితాభ్ర
శకలచయముల వింతరచనలఁ గనుము.

దేవ:-

విష్ణుపదమును జేరంగ వేయఁబడిన
యమృతశిలల సోపానమో యనఁగ వెలయు.

(వెనుక నుండి విటకంటకీ ప్రేమసారులు ప్రవేశింతురు.)

విట:-అయ్యా! గుఱ్ఱములు బాగుగాఁ గట్టఁబడినవా?

ప్రేమ:-ఈ చేరవనె చెట్టునకు గట్టిగాఁగట్టినాను. (ముందువంకఁ జూచి) అల్లదిగో దేవజీవియు వైష్ణవుండును గై యూఁత గొనుచుఁ బోవుచున్నారు.

విట:-ఈ పట్టినామముల శాపనయ్య యా నాకూఁతును బేల్ప అచినది? వీని నామములం జూచి యిది యెట్లు బేలుపోయి యుండునే? కానీ వీరి ముండ మోయించెద.

ప్రేమ:-ఈ చెట్లచాటున నుండియె వారి కంటఁబడకుండ వారిని వెంబడింతము. (జడిఁగి జడిఁగి విటకంటికి ప్రేమసారులు నడచు చున్నారు)

విప్ర:-దేవీ! సరస్తీరమునకు వచ్చినారము.

దేవ:-జీవితేశా! ఈమాధవీలతా మండపమునఁ గిసలయ తల్ప మున సరోవరమున కభిముఖముగాఁ గూర్చుండుదము. (ఇరువురు గూర్చుండుదురు.)

విప్ర:-సరస్సౌభాగ్యముం దిలకించుము.

దేవ:-అది యాశరత్కాలమునఁ గలఁక దేఱినదై నిర్మల మా నసమువలెఁ గన్పట్టుచున్నది.

విప్ర:-దాని యుదరమున నల్పతరంగఁబుల రేఁపు చున్న యా హంసావళిఁ జూడుము.

దేవ:- నాథా!అవు. జూడుము. కారండవ చక్రవాకాది జలవిహంగము లాగ్కొక్కా డోలావిలోలాసక్తములై యెట్లున్నవో—మనోరమణా! అదె కనుఁగొనము అచక్ర

వాక మిథునం బొండొకటి నెడఁ బాయఁగా బెంటిని వెంబడించి యామగపక్షి యెంతత్వరితగతిం బోవుచున్నదో.

విప్ర:- ఔరా! మిథునానురాగ మెంతబలీయము! ప్రేయసీ! ఈరెండ గ్రమ్ముచు వచ్చె. నీ వీవిహంగమిథునముల విభ్రమవిలాసములఁ గాంచుచు నీయంతరంగమును వినోదించుచునిందే యుండుము. నేనీ కొలఁకున నీఁదులాడి వచ్చెద. నాకేమో యీఁదులాడ మనస్సు కుతూహల పడుచున్నది.

దేవ:- పోయిరండు. (విప్రనారాయణుఁడు నిష్క్రమించును.)

విట:- (సంతోషముతో) ప్రేమసారయ్యా! ఆబాపనయ్య పోయినాఁడు. ఇది యొంటిపాటున నున్నది. ఇదేసమయము నడువుము.

ప్రేమ:- మసలఁగాంచి యది యెలుఁగెత్తి యఱచినఁగార్యము చెడును. ఈచెట్లమఱుఁగునకు మెల్లఁగఁ జనుదము.

(ఇరువురు మెల్లగా నడుతురు.)

దేవ:- (కొలనివంకఁ జూచుచు) నాథుఁ డెంతపెద్దమునక వేసెను!

(విటకంటకీప్రేమసారులు వెనుకనుండి దేవదేవిని సమీపించుచున్నారు.)

విట:-ఘాతుకురాలా! ఇందేలయున్నావు? (తలమీఁదగొట్టును.)

దేవ:- (వారిం జూచి) హా! నారాయణా!

(అప్పుడు దేవదేవి మూర్ఛిల్లఁగా విటకంటకీప్రేమసారు లామె నెత్తుకొని పోవుదురు.)

(పునఃప్రవేశము: విప్రనారాయణుఁడు)

విప్ర:- లతాంగీ! ఏమన్నావు?, దేవదేవీ! దేవదేవీ! (భయాశ్చర్యములతో దిక్కులు పరికించి) హా! ఇదేమి! ఎవ్వఁడో తనగుఱ్ఱము మీఁద దేవదేవిని నూర్చుండఁ బెట్టుకొని పోవుచున్నాఁడు! ఎవ్వరెరో వేఱొక గుఱ్ఱము మీఁద వెంటనె పోవుచున్నది! గుఱ్ఱములు చౌకళి నిడుచుఁ బోవుచున్నవి! ఓ దేవదేవీ! దేవదేవీ! (అఱచుచు వెన్వెసఁ బరువిడును.)

రంగము 2. అదే యారామ భాగము.

విప్ర:- గీ. శాశ్వతమ్మగు సఖ్యంబు జరుపఁ గోరి
పరిణయమ్మైతిఁ బ్రేమ నీపడఁతి మిన్న;
నింతలోపల నిట్టి దురంత చింత
గలుగునని స్వప్నమందైనఁ దలఁపనైతి.

ఈకోమలిని ద్వితీయఁగా సహభాగినిఁగాఁ జేకొని నా యాయుష్కాలమును విష్ణుకైంకర్యముతోఁ గడపఁ జూచిన నాకీ వియోగదుఃఖము గలిగెఁగా! దేవదేవీ సాన్నిధ్యశోభితుఁడనై యారామ కార్యములు నడపి నయాన సల్పిన నే నిట్లొంటిపాటున నుండవలసెఁగా! ప్రియురాలి ప్రేమమును బోషణమును గాంచి పెరిగిన యీ తరులతాదులె, ఆ చెలి యనుభవించి విడిచిన యీ రమణీయము లగు తావులె యిఁక నాకూఱట నిచ్చునవి.

సీ. శ్యామాయమానమై చలువలఁ జెలువంది
పడఁతి కింపగు వృక్షవాటి యిదియె

(నడచుచు సుఖ మనుభవించును.)

వైజయంతులు గ్రువ్వ వనితకు ననలిచ్చు
తీపారు విరజాజి తీవ లివియె;

(ఆలింగనము చేయును.)

కడు జాణతనమునఁ గమనీయ భంగిని
వెలఁది నిర్మించిన వేది యిదియె;

(అందుఁ గూర్చుండును.)

తోయజాక్షి తనదు తొడవుల దాఁచంగ
ముదమారఁ గాఁచిన భూజ మిదియె;

(స్పృశించును.)

తొలుదొల్త రాఁగనె చెలికి నీడ యొసంగి
రహి నన్నుఁ జూపినరావి యిదియె;

(మ్రొక్కును.)

సోదరింటలెఁ గొమ్మ యాదరంబునఁ జూచు
లలితమౌ మాధవీలతిక యిదియె;

(ముద్దిడును.)

గీ. సరసకాసార సౌభాగ్యగరిమఁ గనుచుఁ
దరుణి పవళించు కిసలయతల్ప మిదియె;

(ఒఱగి కూర్చుండును.)

ఊష్మకాపోలికలఁ గడు నూగులాడి
వనిత కురుముదంబిను జలపక్షులవియె.

(దృష్టి సారించును.)

శోకోపశమనము చేయునని నేఁబిలఁచిన యీవస్తుజాత ములె తరుణీమణిని స్మరణకుఁ దెచ్చి నాహృదయ సంతాప మును మఱింత చేయుచున్నవి. అక్కటా! ఇప్పుడేమి చేయుదును? నాగృహజ్యోతియు, సహవాసినియు, సహధర్మచారిణియు నగుసతి యెన్నోసిలుగులఁ బడుచుండ మనోవైక్లబ్యమున నూఁట పతిధర్మ మగునా? మదీయ భుజ పంజరమున నున్న నారాచిలుక నే ఘాతుక మార్జాల మెత్తుకొని పోయె? (ఆలోచించి) ఆవృద్ధురాలు విటకంటకియై యుండునా? విటకంటకి కడుఁగ్రూరురా లనిగదా దేవదేవి నాతోఁ జెప్పుచుండెను. అదియె యొక విటుని సాయమున వచ్చి యికాంతం దీసికొని పోయి యుండునా? ఉండ దొప్పు. అటుగాక పురుషుఁడే దీనిఁ గొనిపోవ వచ్చియుండిన వానివెంట స్త్రీయేల యుండును? ఆపురుషుఁడు విటకంటకి వెంట సాహాయ్యార్థము వచ్చినవాఁడై యే యుండును.

ఎత్తికొని పోఁబడుచో దేవదేవి యలబలము గూఁడ జేయఁ జాలని స్థితియం దుండును. పాప మది వారింజూచి వెంటనే భయభ్రాంతిని మూర్ఛిల్లెనో, లేక వారు మచ్చు చల్లి దాని మూర్ఛిల్ల జేసిరో. ఏది యెట్లున్నను గుఱ్ఱము మీఁద నున్న దానిస్థితి మిక్కిలి దీనముగను, అదర్శనీయముగను, దుస్సహశోకా పాదకముగను, నుండెను.

చ. వెలఁదికి దేహమందు స్మృతి
లేక శరీరము క్రుంగియుండె నో
దలయును వ్రాలి సాగి యెడఁ
దం బడియుండెఁ బదారవిందముల్
కాడరుచు నావలీవలను
దూఁగుచునుండె హాయంబుపాఱఁగాఁ
జెలిని గడంగి కౌతు తన
చేతులఁ గప్పక యుండె నక్కటా!

విటుని బారినుండియు వృద్ధవేశ్యా వశము నుండియు సతిని దప్పించుటయె ప్రస్తుత కర్తవ్యము. కంచికిఁ బ్రయాణ మయ్యెద. తడసినఁ బ్రమాదము వాటిల్లు.

ఓరంగ! రంగధామా! భవదీయ భక్తుఁడు
నీసాయంబు వేఁడువాఁడు.

ఉ. ఫాలతలంబుపైనఁ గరపద్మయుగంబు నొగ మోడ్చిభక్తి మైఁ
జాలఁగ వేఁడువాఁడ ననిశంబును గాంచన చేల! యిందిరా
లోల! దయావిశాల! రిపులోక విమర్దన శీల! ప్రోవవే
బాలశశాంకబింబసమఫాల సుశీలను మద్వధూమణిన్.

(నిష్క్రమించును.)

రంగము 3. విటకంటకీ మందిర మందలి యంధకార గృహము.

(ప్రవేశము: దేవదేవీ మధురవాణులు గూర్చుండి)

మధు:-సోదరీ! నీవువిప్రోత్తముని వివాహమగుటాఁ జేసి, మనము చఱచిన పన్నిదమున నేనోడితిని; నీవు నీశపథము చెల్లించుకొన్న దాననై గెలిచితివి.

దేవ:-అక్కా! వేశ్యావృత్తిని మానుటాఁ జేసినీవును నీప్రతిజ్ఞను సారముగ నున్నావు. నే నిల్లు విడిచిన దాదిగ వేశ్యావృత్తిని విడిచితి నంటివి గదా యదెట్లు పొసఁగినది?

మధు:- (పరిహాసముగ) నీదృఢ సంకల్పమును గుర్తి నీచేసిన ప్రతిజ్ఞయందుఁ దప్పక నీకు విజయము గలుగునని నాకప్పుడే తోఁచుట వలన నేనట్లుచేసితిని.

దేవ:-నీవేమో పరిహాసముగఁ బలుకు చున్నావు. నిక్కము చెప్పుము.

మధు:-సోదరీ! నామనోవృత్తి నీకుఁ దెలియక పోలేదు. వేశ్యావృత్తియందు నాకుఁ గల జుగుప్సను నేనప్పుడప్పుడు నీకు వెలిపుచ్చు చుండ లేదా? ఆజుగుప్సయె నన్నుఁ దద్వృత్తిని వదలు నట్లు చేసినది; నాయంతరంగమును ప్రేమము కడకుఁ ద్రిప్పినది. ఆవృత్తిని విడనాడిన దాదిగ విటకంటకి పెట్టు గోడునకుఁ దాళలేక గదా నేనీయిల్లు విడిచి నీతో ఆకు శ్రీరంగమునకుఁ బ్రయాణ మైనది. దానిలోఁ బాము కఱచుటయు, ప్రేమసారునిచే నేనెట్లు గుర్తింపఁబడి కాపా

డంబకుటయు, నీయునికి నాముఖమున నెట్లు బయలు పడుటయు, మున్నగు సంగతులు నీకుఁ జెప్పితిఁగదా. దేవదేవీ! నీ వనుభవించు చుండిన దాంపత్య సుఖ సంతోషములను దప్పించిన పాపాత్మురాలను నేనగదా యని నాకు మిక్కిలి విచారముగ నున్నది.

దేవ:- తానొకటి దలఁప దైవ మొకటి దలఁచు. ఈవిషయమున నీవు నిరపరాధినివి. నీముఖము నుండి నాయునికి బయల్పడుటయు, మనకీ యంధకార గృహప్రాప్తియు దైవికములు. కాని మనకీ దుఃఖము గలుగుట భావి మహాసుఖావాప్తికే యని నమ్ముచున్నాను.

మధు:- ఇంకెక్కడి సుఖము. ఈయంధకార గృహ మరణమె మనకు శరణము.

దేవ:- అక్కా! అట్లనకు. దైవమును నమ్మిన మనకు దైవమే సాయపడును. భర్తాగ్రేసరుఁడు నాకు మగఁడగునని కలలోనైనఁ దలఁచి యుంటిమా? నా యాది సంకల్పమేమి? అది పరిణమించిన విధమేమి? దైవయోగములు దుర్జ్ఞేయములు. కాలిచప్పుడు వినవచ్చుచున్నది. ఎవ్వరో వచ్చుచున్నారు?

మధు:- ఈయర్ధరాత్రమున నిక్కడకు వచ్చు వారింకెవ్వరుందురు! అదృష్టపిశాచమైయుండును.

(ప్రవేశము: విటకంటకీ ప్రేమసారులు తలుపుదీసికొని దీపముతో)

విట:-దేవదేవీ! నీకుఁ గడసారి యుపదేశ మొసఁగ వచ్చి యున్నాను. దాని ననుసరించిన నీయభీష్టమును నాయభీష్టమును నెరవేరును.

వేశ్యావృత్తి నవలంబింప నీకిష్టము లేదంటివి. సరె. ఎవరినైన మగనిగఁ జేకొనుము. అది నీకిష్టమే కదా?

దేవ:-అమ్మా! నీవు నన్నుక్షమించు నెడల నామనసు విచ్చి చెప్పెదను.

విట:-అట్లె చెప్పుము.

దేవ:-అమ్మా! నే నొకరిదానను.

విట-ప్రేమ:-అదెట్లు?

దేవ:-నే నా విప్రోత్తముని బరిణయ మైనదానను. కావున నే నాతని దానను. ఇతరుని నెట్లు చేపట్ట నగును?

అన్నా! ప్రేమసార! నీవు నాపై గాఢమోహము పూని యుండుటను నాసోదరి వలన విని యున్నదానను. ఆ మోహ శల్యమును నీహృదయము నుండి పెకలించి నన్ను నీ సోదరిగఁ జూడుము. ఇఁక నన్నాశించుట నీకుఁదగదు.

విట:-ఏమి! వెలయాలికి నీ వ్యామోహము! నీచర్యలు నీపరుషవాక్యములు నన్ను మిక్కిలి రేపుచున్నవి. నామాట వినవా? వినవా? గట్టిగఁ గడసారి యడుగుచున్నాను. వినవా?

వింటివా నీతలపైఁ గనక వర్షము గురియించెదను, లేదా బహుకష్టములపాలు చేసెదను. పలుకుము.

దేవ:-అంధకార గృహావాసము కంటెఁ గష్టతరమైన దేమున్నది?

విట:-అట్లనలా? కానీ మీరు రేపటినుండి దినమంతయు గృహారామమునకు నీళ్లు మోయవలెను. వింటిరా నాయాజ్ఞ?

దేవ:-తల్లిరో నీచిత్తము వచ్చినట్లు చేయుటకు సిద్ధముగ నన్నాము.

విట:-ప్రేమసారయ్యా! వీరిని నీయధీనము చేయుచున్నాను. వీరి నీవెట్లయినను నుపయోగించుకొనుము.

ప్రేమ:-(లోపలలో) నన్నింత నీచుగ భావించుచున్న దీ యయోగ్యురాలు! (ప్రకాశముగ) వీరిని జెఱ దప్పింపుము. వెలుపలికి నడువుము. నేఁ జెప్పెదను.

విట:-చెనటలారా! వెలికి నడువుఁడు. మీపని పట్టించెదను. (అందఱు నిష్క్రమింతురు.)

## రంగము 4. విటకంటకీ గృహారామము.

(ప్రవేశము: జీవ జీవీ మధురవాణులు మంటి కడవలతో)

మధు:-తెలిపిలేక నీళ్లుమోయు కష్టము నానిమిత్తమునఁ గదా నీకును గలిగినది.

దేవ:-నీ నిమిత్తము నాకుఁ గష్టము; నా నిమిత్తము నీకుఁ గష్టము. ఒక్కరక్తమును బంచుకొని పుట్టిన మనము కష్టమును దుఃఖమును బంచుకొనుట న్యాయ్యమె. నీవె

యీకష్టమునకుఁ దాళలేక మిగులఁ గృశించితివి. నేఁటి కష్టమున కోర్చినదాన నగుటచేఁ నను పోషించిన కార్యము నాకవలీలగ నున్నది.

ఉ. ఎండకు నెండి వర్షమున
కొంతయు నాని కవేంటనదీ
కాండము లందుఁ గ్రుంకులిడి
గాలికి సీతున కోర్చి మాఁచుసం
ముండి వనంబు కార్యముల
నోరిమిఁ జేసి కరంబు దట్టమై
యుండిన దేహ యష్టినుమి
యోర్వదె చెల్లకు నీళ్లమోయుఁగన్.

మధు:-నీవును మిక్కిలి కృశించినావు మన మిట్లు కృశించి యుండుటకుఁ గారణము మనపడు కాయకష్ట మంతగాఁ గాదు అంధకార గృహావాసమే కారణము.

దేవ:-అక్కా! మనకు మంచిదినములు రాకపోవు.

(ప్రవేశము: విప్రనారాయణుండు దూరమున)

విప్ర:-అదుగో! ధర్మపత్నియగు దేవదేవి! దాసిచెంత నుండునది దాసిసోదరియై యుండును. తరుపోషణమను కార్యముం జేయుచున్నారు. దేవదేవిని గొనిపోవుట కిదియె మంచి తరుణము. (దేవదేవి కడకు నడచును.)

మధు:-దేవదేవీ! ఎవరో వచ్చుచున్నారు!

దేవ:-(చూచి) నామది భ్రమ చెందుచున్నదా లేక నామనో నాథుని నిక్కముగాఁ జూచుచున్నదాననా? ఆహా! నా సకలాంగములకు సంతృప్తి యావహిల్లుచున్నది!

మధు:-(ఆశ్చర్యముతో) ఏమి! ఈతఁడు విప్రోత్తముఁడా! గుర్తింపలేక పోతిని.

దేవ:- (విప్రనారాయణు నెదుర్కొని) నామనోవిభుని బున ర్దర్శనమూ గూర్చిన నాభాగ్యజీవతను నేనెంతని కొని యాడుదును! నాథా! నేనిక్కడకుఁ దేఁబడుట మీకెట్లు తెలిసె? నేను మీసన్నిధి నుండి దూరము చేయఁబడినను, మీనుండి దూరము కాలేదు.

విప్ర:- నే నాసరోవరమున నీఁదులాడి వచ్చి, నిన్నుఁ గాన కాయాసపడి దిక్కులు చూడ వృద్ధస్త్రీ నెక్కించుకొని యొకగుఱ్ఱమును, నిన్నును నొకపురుషుని నెక్కించుకొని మఱియొక గుఱ్ఱమును, ఆరామ వీథిని బోవుచుండఁ గనుఁ గొంటిని. ఆ వృద్ధురాలు విటకంటకియే యై యుండు నని తరువాత నాకుఁ దోఁప, నీవిటకే తేఁబడి యుందువని తెలఁ చి, యిక్కడకే తెంచితిని. ఈ యారామమున నీవును నీసోదరియు నుండుట నాకొక దాసి చెప్పఁగా, నేనిటు వచ్చి నిన్నుఁ గాంచితిని.

మధు:-నీమీఁది ప్రేమయే సుమీ యీతని నింత దూరము రప్పించినది. నీవు ధన్యురాలవు.

దేవ:-ఈ నిర్బంధము నుండి విడుమర గాంచి నవ్వుదు కదా నేను ధన్యురాల నగుట.

విప్ర:-ప్రేయసీ! ఇట్టులే నా వెంట రమ్ము. ముసలిదాని కంటఁ బడకుండ జాతి పోవుదము.

మధు:-చెల్లెలా! నన్నేమి చేసి పోయెదవు?

దేవ:-అక్కా! నీవును నా వెంటనె రమ్ము.

విప్ర:-ఈ చెట్లచాటుగ రండు. నాఁటి పోవుదము.

(ప్రవేశము: విటకంటకి, యొకదాసి, నలువురు సేవకులు.)

దాసి:-అమగో! ఆ నామాలయ్యాయె తోఁటలోన్కి వచ్చింది.

విట:-వాఁడా విప్ర హాతకుఁడు. సేవకులారా! వేగిరము పోయి వానిం బట్టి తెండు. (సేవకులు పోయి విప్రనారాయణుం బట్టి తెత్తురు. దేవదేవీ మధురవాణులు వెంటనె వత్తురు.) ఓయీ! బాపనయ్యా! మరల నీవు దేవదేవిని లేవఁదీసి కొని పోవుచున్నావా? రొక్కమునకుఁ గాని వలవని రోయింతి, బిచ్చగాని నిన్నెట్లు వలచినదో! మందుమాకే మైనఁ బెట్టితివా? నాపట్టిని నీవు వలచు పక్షమున నన్నా చేసియో, దొంగలియో, జీవధన మమ్మియో, రొక్కముఁదీసికొనిరమ్ము. అది లేక నీవిం దొకైన మసలుచున్న నీకోఁకఁ గోసి సున్నము పెట్టెదను. వెళ్లుము పొమ్ము (దేవదేవి మధురవాణులం జూచి) మీరు నీళ్లు పోయ నలదు. ఏమియుఁ జేయ నలదు. నడువుఁ డంధకారగృహంబునకు.

విప్ర:-రంగఁడు నన్ననుగ్రహింపఁడాయె. ఓరంగ! శ్రీరంగ! నన్నింకను బరీక్షించెదవా?

(విప్రనారాయణుఁడు దేవదేవీ మధురవాణుల వైపుచూచుచు మెల్లఁగఁ బోవుచుండును,)

విట:-ఇంకను వీండిదిక్కునకె తిరిగి తిరిగి చూచు చున్నావా? శీఘ్రముగ వెడలి పోయెదవా లేక యర్ధచంద్ర ప్రయోగము చేయించ వలెనా? (విప్రనారాయణుఁడు నిష్క్రమించును పిమ్మట నందఱు నిష్క్రమింతురు.)

రంగము, 5. విటకంటకీ గృహము ముందరి భాగము.

(ప్రవేశము: రంగనాథుఁ డను బాలుఁడు బంగరు గిన్నితో)

రంగ:-ఇదియె విటకంటకీ గృహము ఈయర్ధరాత్రమున నీమె నిద్రించుచుండును. మేల్కొలిపెదఁ గాక. (తలుపుదట్టుచు)

విటకంటకీ! విటకంటకీ! ... విటకంటకీ!

(ప్రవేశము: విటకంటకి తలుపు తెఱచికొని)

విట:-(తనలో) విప్రనారాయణుఁడు వచ్చినట్లున్నది. అతఁడు రొక్కము దెచ్చి యుండును. (రంగనాథుని సమీపించి చేతిలోని బంగారు పాత్రఁ జూచి) అయ్యా! విప్రనారాయణయ్యగారు! లోనికి రండు.

రంగ:-అమ్మా! నేను విప్రనారాయణయ్యఁగాను. నేనాతని శిష్యుఁడను. నన్ను రంగనాథుఁడందురు. మాగురువుగారీ బంగారు పాత్రను మీకిమ్మని నన్నుఁ బంపినారు.

(పాత్రనిచ్చును.)

విట:-(పాత్రనందికొని) సంతోషము. పరమ సంతోషము. స్వామీ! లోనికి దయచేయుఁడు (ఇరువురు లోనికిఁబోవుదురు.) కూర్చుండుఁడు. విష్ణునారాయణయ్యగా రెక్కడనున్నారు? ఎందుండి దీనిని బంపినారు?

రంగ:-శ్రీరంగమునందె యున్నారు. పేఁటలో నంతగా నుండక యాలయములోనె యుందురు.

విట:-అంత దూరము నుండి మీరు వచ్చుట చూడ మీగురువుగారిపై మీకుఁ గలభక్తి యెంతని తెలియుచున్నది. అయ్యా! రంగనాథా! నీకు మంచి గురువుగారే దొరకినారు. ఇంటిపనుల విషయమున దేవదేవుని వెట్టితనము మానుమని నేనఁగా, అయ్యగారు తన్ను నిట్లు భావించి పుల్లసిల్లి చిట్టుమని చెప్పకయె లేచి పోయినారు. ఇట్టి వెట్టియ్యగారు నీకెట్లు చదువు చెప్పవారో! అయ్యా! రంగప్పా! ఇప్పుడైనను నలుక చాలించి రమ్మని మీ గురువుగారితో నామాటగా చెప్పుము. ఆయన వెళ్లిపోయిన దాదిగ మాపిల్లయుఁ జిట్టుముట్టుపడుచున్నది. ఆయన వచ్చినఁ గాని యింటిలోని కలఁతలు దీరవు కావున నెట్లయినను త్వరలోఁ దప్పక రమ్మని చెప్పుము.

రంగ:- అట్లె చెప్పెద. నేఁబోయి వచ్చెద.

విట:- ఈ తాంబూలము గైకొనుము.

రంగ:-అమ్మా! సదావటువుల మగు మాకీ తాంబూలమేల? దీనిని మీరు మా కొసంగను రాదు, మేము గైకొనను రాదు.

విట:-అయ్యా! నీవొల్లకున్న దీని నీగురువుగారి కందఁజేయుము.

రంగ:-వారికి దీనిని మేమిచ్చుట మహాపచారము. వారును బ్రహ్మచారులు గదా.

విట:-ఆయన బ్రహ్మచారి యెట్లు? ఆతఁడు మాయింటి రాయఁడే, మాయింటి యల్లుఁడే.

రంగ:-అదియేమో మాకుఁ దెలియదు. ఈతాంబూలము వారింటకు వచ్చినప్పుడే వారి కియ్యఁదగును. నేఁబోయి వచ్చెద. (నిష్క్రమించును)

విట:-ఈబాపనికీ రంగారు బంగారుగిన్నె యెట్లు వచ్చియుండును? ఇది బంగారమే యై యుండునా? (పరీక్షించి) దీని మీఁద శంఖ చక్రాంక విలాసములున్నవే! ఇది దేవధన మగు పదార్థమువన్న పసిఁడిగిన్నె! దీని నాతఁడు రంగనాథాలయమున దొంగిలి యుండనోపు. ఆతఁ డెట్లు సంపాదించిన నాకేమి? దీనిఁ దేవదేవికిఁ జూపవలెనా? కానీ తెల్లవారనీ. ఆలోచించెదఁగాక. దీని నిప్పుడీ యినుపపెట్టెలోఁ బెట్టి పదిలపఱచెద.

(నిష్క్రమించును)

రంగము 6. శ్రీరంగనాథ దేవాలయ మందలి మంటపము.

(ప్రవేశము: విప్రనారాయణుఁడు.)

విప్ర:- చ. అలరు చిరాంగిఁ బాసి విర
హానల వేదన కెట్టులోర్తుఁ? బె
దలి మరలంగ నంగనను
దచిర భాగ్యము నాకుఁగల్గునో
కలుగదో? కల్గకున్న బ్రదు
కంగల దెవ్విధి? పెండ్లియాడి "తా
వలచిన యిటఁ బాయునగ
వచ్చు సుమీ పగవానికైనియున్."

అక్కటా! గృహస్థుఁడ నగుట ధర్మపత్నీసాంగత్యము నిరంతరాయముగ జరుగు నని యెంచితి; కాని వియోగ దుఃఖము ప్రాప్తించె.

క. నాపూర్వజన్మకృతమగు
పాపం బీకరణి నాకు వ్యథఁ గూర్చెదు,నా
పాపఫల మనుభవించుచుఁ
బాపంబును బాచికొనుట భవ్యముగాదే?

అత్యంత ధనకాంక్షగల పిటకంటకి దొంగిలియైన విత్తముం దెమ్మనియోఁ గదా. రంగ రంగా! అట్టినీచ బుద్ధి నెన్నటికిని నాకొసంగకుము. అస్పృశ్యవేశ్య నలువురు సేవకుల సాయమున నన్నుఁ దఱిమి వేసెఁగా! లోకమున నంగబలమునకే నా విజయము గల్గునటు? ఆత్మబలమునకు విజయ

ముండదా? ఏమి యీ విపరీతము! లోకమున నంగబలము కంటె ఆత్మబలమె ఘనతరమైనదనియు, దివ్యతరమైనదనియు, మహత్తరమైనదనియు,నుడువుదురుగదా. ఓరంగా రంగధామా! నాయందాత్మబలము కొఱవడియున్న నీయందలి ధ్యానముచే దాని నుత్తేజిత మొనర్పుకొనువాడ.

సీ. గోవింద గోపాల శ్రీవధూటీలోల
సంస్తుత గుణజాల, సత్యశీల
భక్తాళిఫలదాత నందిత పురుహూత
జననుత చారిత్ర చారువక్త్ర
తాపసహృత్స్థాన తపనీయ పరిధాన
కారణకారణ కంసహరణ
కాలాభ్రరుచిదేహ ఘనసమున్నతబాహ
నిర్దళిత విపక్ష నీరజాక్ష

గీ. సకలభువనైక రక్ష విశాలవక్ష
దీనజన గృహప్రాంగణ దేవవృక్ష
శంఖ చక్రగదాఖడ్గ శార్ఙ్గధార
సరస మురళీ మృదు మధుర స్వన విహార!

(ప్రవేశము: రంగనాథుఁడు.)

రంగ:—అయ్యా!

విప్ర:—డింభకా! నీవెవ్వరు? నీపేరేయ్యది?

రంగ:-విటకంటకి పంపిన సందేశహారుడను. నన్ను రంగనాథు డందురు. విటకంటకి మిమ్ములఁ గంచికి రావించుచున్నది.

విప్ర:-ఏమి యాశ్చర్యము!

రంగ:-మీయింట లేకపోవుటచేత దేవదేవి దిగులుఁ గలఁగి పడు చున్నదనియు, మీరు వచ్చినఁగాని యీమెహృదయము తాపము తీఱదనియు విటకంటకి నుడివి, మిమ్ముల నెట్లయినను త్వరలో రాఁబ్రార్థించెను.

విప్ర:-విటకంటకికి బుద్ధి మేలతి యుండనోపు! ఆమె నావెంట నాభార్యను బంపును గాఁబోలు. ఏమి నాభాగ్యము! ఈ రంగనాథుఁడు నాపాలిటి శ్రీరంగనాథుఁడై వచ్చి నాకీ శుభసందేశమును దెలుపు చున్నాఁడు. (గర్భాలయమువైపు దిరిగి) ఓశ్రీరంగేశ్వరా! ఇది యంతయు నీమహిమయే దేవా! (తలవంచి నమస్కరించును. రంగనాథుఁ డంతర్ధాన మగును.)

రంగనాథా! నీవు కాంచీపురము విడిచి యెన్నాళ్లాయె? (పరికించి చూచి) ఈ బాలకుఁ డెందుఁబోయె? అయ్యో! రంగనాథా! రంగప్పా! రంగయ్యా! (ఆశ్చర్యముతోఁ గొంత నడచి యీవల నీవలఁ జూచి బిగ్గరగా) రంగ! రంగా! శ్రీరంగా! (భయాశ్చర్యములతో) ఆహాహా! ఈమహాపర్వము కవాట రంధ్రము గుండ గర్భాలయము లోనికిఁ బోవుచున్నది! రంగనాథా! నీమహిమ మెఱుఁగ శక్యము గాదు. (తూర్పుదిక్కు చూచి) ఓహో!

గీ. తెల్వి గాంచెను బ్రాహ్మీశ తెలతెల పడి;
కొటకులకుఁ బోవుఁ బులుఁగులు కొలకొల మని;
పులుఁగు లకుఁ గల్గు తెక్క లేఁ గలిగి యున్న
జంగు మని పోన జలజాక్షి చెంగటికిని?

ఒక్క గడియ యొక యేడాదిగాఁ దోఁచు నాకీ దీర్ఘప్రయాణకాల మెట్లు గడచునో? శ్రీరంగనాథా! పోయిన చ్చెద. నన్ను మఱవకుము, దేవా! (నమస్కరించి నిష్క్రమించును.)

రంగము 7. శ్రీరంగ గర్భాలయము, దాని ముందరి భాగము.
(ప్రవేశము: ముద్రకర్త, గండభేరుండాచార్యుఁడు, తిరువేంకటాచార్యుఁడు, తాతాచార్యుఁడు, నంబులు, భక్తాదులు)
(ముద్రకర్త బీగము దీసి గర్భాలయ కవాటములు తెఱచును.)

గండ:-(లోనికిఁబోయి కర్పూర నీరాజన మొనర్చి, బంగారపు టర్ఘ్యపాత్రమునకై వెదకును.) తిరువేంకటాచార్యా! పెద్ద బంగారపు టర్ఘ్యపాత్ర మెక్కడఁ బెట్టినావు?

తిరు:-స్వామి సన్నిధినే యున్నది. కొంచెము కన్నులు తెఱచి చూడు.

గండ:-కన్నులు మూసికొనియే నేఁజూడఁ గలుగు పత్రమున విన్నదుగకయే దాని యునికి దెలిసికొని యుందును. నేను గన్నులు తెఱచియే చూచితిని. అదికాన రాలేదు. నన్ను

రాత్రి యర్చన చేసింది నీవు. నీవువచ్చి వస్తువు లన్నియు నప్పగించిపో. (బయిటికి వచ్చును.)

తిరు:-గండభేరుండాచార్యా! నీవు గొత్తి వానివలె నటించుచున్నావే!

గండ:-నేను బ్రాంతవాండను గాంబట్టియె హెచ్చరిక పడిముందుగానే నిన్నడుగు చున్నాను.

తిరు:-అయ్యా! రమ్ము. వస్తువుల నప్పగింతును. (ఇరువురు గర్భాలయము లోనికిం బోదురు. తిరువేంకటాచార్యుండు పాత్రకై వెదకి దానిని గానక తత్తర పడుచు) గండభేరుండాచార్యా! ఇక్కడం బెట్టిన పాత్ర యేమాయె?

గండ:-గట్టివాండవే. పాత్రయె లేదని నేనుచెప్పునది. అన్నది గెదవేమి? ఎక్కడ నున్నదో చూపు. చూపవేని ధర్మకర్త గారితోం జెప్పెదను.

తిరు:-ఆతురపడ కయ్యా! ఎక్కడనో యున్నది.

గండ:-ఎక్కడనో యున్నదా! ఊండుచోటనే యున్నది. వస్తువునకు వినాశము లేదని నాకును దెలియును. కాని యది యిక్కడ మాత్రము లేదు. నే నిప్పుడే పోయి ధర్మకర్త గారితోం జెప్పెదను. చెప్పకున్న నా తలమీందికి వచ్చును.

తాతా:-గండభేరుండాచార్యా! ఆతురపడకుము.

గండ:-నాకా నీవు బుద్ధి చెప్పువాండవు? దేవుని సొమ్ము పోయిన నీవిచ్చెదవా నీయబ్బ యిచ్చునా?

తాతా:-అయ్యా! తొందరపడకుము. తిరువేంకటాచార్యా! అంతరాళింద మరయుము. రంగమండపములో వెదకుము. తిరు మజ్జనపుఁ బాత్రలఁ బరిశోధింపుము. అందుండు పువ్వుల బుట్టను శోధించితివా?

తిరు:-అయ్యా! అంతయుఁ బరిశోధించితిని. ఎందును గానరాలేదు. నిన్న రేయి స్వామి సన్నిధి నిక్కడనే పెట్టితిని. నాకు బాగుగా జ్ఞాపక మున్నది. తాతాచార్యా! నీవును వచ్చి చూడుము. రాత్రిక్రొత్తవారెవ్వరు వచ్చి యుండలేదు.

తాతా:-(లోనికిఁ బోయి యంతయు వెదకి వచ్చి) ఏమియాశ్చర్యము! అది యెట్లు పోయియుండును!

ముద్ర:- మీలో నెవరైనను బోయి ధర్మకర్తగారిని దోడితెండు.

గండ:-అట్లు చేయకున్న నేరము నాతలపై వ్రాల వచ్చును. ముద్రకర్తగారూ! నేనే పోయి వారిని దోడితెచ్చెద.

తాతా:-అయ్యా! నేను బోయి వచ్చెదనులే.

గండ:-ఈ యుదయమున వస్తువు లన్నియు నాకొప్పగించు నప్పటికిఁ బెద్ద బంగారపు టష్టిపాత్రి ముండలేదని చెప్పుము సుమా. (తాతాచార్యుఁడు నిష్క్రమించును. అర్చకులు వెదకు చుందురు. భక్తాదులు గొందఱు భజన చేయుదురు; కొందఱు పాడుదురు; కొందఱు సాష్టాంగదండ ప్రణామము లాచరింతురు)

(ప్రవేశము: తాతాచార్యులును ధర్మకర్తయు)

ధర్మ:-ముద్రకర్తగారూ! తాతాచార్యులు చెప్పునది చూడఁ జాల వింతగా నున్నది. మీరు వేసియుండిన ముద్రలన్నియుఁ బదిలముగా నుండెనా?

ముద్ర:-పదిలముగా నుండెను.

ధర్మ:-తిరువేంకటాచార్యా! గండభేరుండాచార్యా! మీరు లోపల బాగుగాఁ బరిశోధించితిరా?

తిరు-గండ:-అంతయుఁ బరిశోధించితిమి. పెద్దబంగారపు టర్ఘ్య పాత్ర మెందును లేదు.

ధర్మ:-(కోపముతో) కోవెలలోని సామ్ములయిన నింకేమున్నవి. అర్చకులారా! నంబులారా! శ్రీరంగేశుని సొమ్ములఁ దాత ముత్తాతల కాలము నుండి తిని యుండలేక దొంగతనము చేయ మొదలు పెట్టితిరా? ఒకటిపాటును నంను మీరు గాక యింకెవ్వరీ కార్యమును జేయ సాహసింతురు?

గండ:-ఇది యందఱ మీఁదికి వచ్చెనే!

మొదటినంబి:-జియ్యా! స్వామి బంగరు పాత్రను దొంగతనము చేయ మేమెంతవారము!

రెండవనంబి:-స్వామీ! మేము దాఁచికొన్న సితిగంధప్రసాదము యొక్క గుల్లకాసో దాఁచి కొందుము గాని బంగరు పాత్రను దాఁచికోఁ జాలుదుమా!

మూఁడవనంబి:-ఒకపిక్కిన పోఁక నక్కఱయు, రెండు గుగ్గిళ్లో మనసు పడిన నొక నవకతుకనో కొనుట నిజము కాని యింతలేసి పనులు మేము చేయఁజాలుదుమా!

ధర్మ:-విప్రనారాయణుఁడెక్కడ?

తాతా:-అతఁ డిక్కడ లేఁడు.

తిరు:-స్వామీ! అతఁడు నిన్నరాత్రి కోవెల లోనికి వచ్చుచుఁ బోవుచు నుండెను. రాత్రి గూడ ముందరి మంటపములోఁ బరుండి నట్లుండెను.

ధర్మ:-ఇటీవలి నడవడిఁ బట్టిచూడ నాతని మీఁదనే నా కనుమానము మిక్కుటముగా నున్నది. దివాణమువారికి సంగతు లన్నియుఁ జెప్పి యారక్షకాధికారిని విప్రనారాయణు నారామమునకుఁ గొనిపోయెదను. ముద్రకర్తగారూ! బీగములను ముద్రలను జాగ్రత్తగా వేసి చూచికొనుచుండుఁడు. తిరువేంకటాచార్యా! రమ్ము పోవుదము. (తిరువేంకటాచార్యుఁడు ధర్మకర్తయు నిష్క్రమింతురు.)

ముద్ర:-గండభేరుండాచార్యా! పెరుమాళ్లు కారతి చేయుము. మనమును బోయి సంగతు లరయుదము.

(గండభేరుండాచార్యుఁడు దేవునికిఁ బూజలొసంగి మంగళార్తిసము జేయును. ముద్రకర్త తన సేవకుల సాయమున గుడితలుపులు వేసి బీగమునకు బట్టచుట్టి లక్కముద్ర వేయును. అందఱు నిష్క్రమింతురు.)

రంగము 6. కంచి. ఒక విడిది.

( [illegible] ...సారుఁ డాలోచించుచు)

విప్ర:-దేవదేవి విలాస విభ్రమములకును, దాని సంగీతవిద్యావిభవమునకును బేల్పడి కామోన్మత్తుఁడనై వేసరక

తిరిగి తిరిగి వెకలి నైతిని. అక్కటా! దుర్లభ జనాను రాగంబు నాకేల పొడమె?

దేవదేవిని నాయాసీనము చేసెద ననికదా విటకంటకి పలికె. అక్కటకటా! భక్తవరుని బరిణయమైన పరకాంతను స్పృశించుచుంటిటి పాపాత్ముఁడనా నేను?

సర్పదష్టుఁడగు మధురవాణిని గాంచీ పురి కేను గొని పోవుచో నామె ముఖము నుండి వెడలిన వచో తీవ్రమారుతమునకు నాహృదయాకాశమున నావరించి యుండు మోహ జలధరములు చిన్నభిన్నమై వెసలేక చెదరిపోయినవి.

అటుపిమ్మట దేవదేవి నిష్ఠురవచన నారాచ పాతమున, ఆమె లావణ్య రసాంబుధి నోలలాడు చుండిన నాచిత్త మీనము, శాంత్యమృత సరోవరాభిముఖముగాఁ బ్రవహించు స్రోతోమార్గముం బ్రవేశించినది.

(ప్రవేశము: మదనమోహనులు)

మదనా! మోహనా! రండు. మీకై యెదురు చూచుచుంటిని.

మద:-దేవదేవి విప్రనారాయణారామ మందుఁ జిక్కెనని శ్రీరంగము నుండి నీవు పంపిన లేఖ మాకుఁ జేరఁగానే, నీవందుఁ గోరినట్లు వెంటనె ప్రయాణమై వచ్చితిమి.

ప్రేమ:-మిత్రుని మాటలు త్రోసివేయక వచ్చినందులకు మీకభివందనము లర్పించు చున్నాను.

మోహ.- నీయభీష్టము సిద్ధించినదా?

ప్రేమ:- లేదు.

మద-మోహా:- కారణము?

ప్రేమ:- దేవదేవి విప్రనారాయణుని ప్రేయసి యైనదఁట.

మద-మోహా:- అద్భుతమును ఆశ్చర్యమును నగుసంగతి విను చున్నామే!

మద:- అట్లయిన నీవేమి చేయ నున్నావు?

ప్రేమ:- నేనేమి చేయఁ గలను?

మద:- విటకంటకి నీకొరకే గదా?

ప్రేమ:- అవును. అయిన?

మద:- దేవదేవిని బలాత్కారమున ... ...

ప్రేమ:- హరిహరీ! వలదు; వలదు. అది నీచము; పాపము.

మోహా:- అది యొల్లకున్న నింకేమి చేసెదవు?

ప్రేమ:- బ్రహ్మచర్యముతనే నాజీవితము గడపెదను.

మద:- అంత కఠినమును మూర్ఖమును నగుపట్టేల?

ప్రేమ:- ఇది మూర్ఖపుఁబట్టు గాదు. నా మనఃప్రేరిత మగు సంకల్పము.

(ప్రవేశము: విటకంటకి యొక్క దాసి తొట్రుపాటుతో)

దాసి:- (ప్రేమసారునితో) సామీ! దేవదేవి మధురవాణి మా ముసలమ్మ పెనాపెద్ద యాపదలో నుండారు. ముసలమ్మ మిమ్మల్ని యెంటనే తోల్కొని రమ్మని సెప్పింది.

ప్రేమ:- (ఆత్రముతో) ఏమి సంగతి?

మోహా:- తొందరపడకుము. నిదానించి చెప్పుము.

దాసి:- (తొందరపాటున) విప్రనారాయణయ్య వచ్చినాఁడు గదా. అతఁడు రంగప్ప గుడిలో బంగారుపాత్ర దొంగిలి తెచ్చినాఁడని యారక్షకాధికారి, బంట్లు, ఇంకా యెవరో వచ్చి యిల్లుశోధించినారు. ఆ బంగారుపాత్ర మా ముసలమ్మ యినుపపెట్టెలో వుండింది. ఆరక్షకాధికారి వారి సందిత్నీ దివాణంకాడికి రమ్మనుచున్నాఁడు. అందఱు చూస్తుండారు. ముసలమ్మ దొంగతనంగా తనకాడికి నన్ను సైఁగచేసి పిల్చి మిమ్ము తోల్కొని రమ్మని పంపిందాది.

(లోపలఁ గలకలము)

ప్రేమ:-(కిటికినుండి చూచుచు) వీథిలోఁ గలకల మగుచున్నది. (విషాదాశ్చర్యములతో) మిత్రులారా! చూడుఁడు; ఎంత గుం పెంతగుంపు! అయ్యో! కఠోర శృంఖలా బద్ధుఁడై విప్రనారాయణుఁడు ముందునడచు చున్నాఁడు. అతని వెన్కవిట కంటకియు, దాని వెన్క దేవదేవీ మధురవాణులును నడచుచున్నారు అక్కటా! అవనత శిరస్కయై యడుగిడు మధురవాణి ముఖమెంత విషాదచ్ఛన్నమై యున్నది! దేవదేవి తన చెఱఁగునఁ గన్నులు పులుముకొనుచు వెక్కివెక్కి యేడ్చుచుఁబోవుచున్నది! విటకంటకి మిక్కిలి ఖిన్నరాలై యున్నది. మిత్రులారా! రండు. వారివెంబడిపోయి వారి నీయాపద నుండి రక్షింపఁ బ్రయత్నింతము. (అందఱునిష్క్రమింతురు.)

---

# విప్రనారాయణ నాటకము

## పంచమాంకము.



### రంగము 1. చోళరాజేంద్రు సాస్థానము.

(ప్రవేశము: రాజు, మంత్రి, లేఖకుఁడు, భటులు, శృంఖలాబద్ధుఁ డగు విప్రనారాయణుఁడు, ఆరక్షకాధికారి, ఆరక్షకులు, దేవదేవి, మధురవాణి, విటకంటకి.)

రాజు:-సాక్షు లందఱు వచ్చియున్నారా?

లేఖ:-మహాప్రభూ ! అందఱు వచ్చి యున్నారు. దేవాలయ ధర్మకర్తయగు రంగాచార్యుఁడే ప్రథమసాక్షి. ధర్మకర్త రంగాచార్య!

(ప్రవేశము: రంగాచార్యుఁడు.)

మంత్రి:-నీవు శ్రీరంగమున నేయుద్యోగమున నున్నావు?

రంగా:-నేను శ్రీరంగదేవాలయ ధర్మకర్తను.

మంత్రి:-శ్రీరంగేశుని బంగారుపాత్ర యేనాఁ డెప్పుడు కనఁబడ లేదు?

రంగా:-పోయిన కార్తిక బహుళతయోదశి నాఁటి యుదయమున గర్భాలయ కవాటములు తీసి చూచు నప్పటి కాపాత్ర యుండ లేదని వింటిని.

మంత్రి:-పాత్రపోయిన పూర్వదినము పూజ నడపిన యర్చకుఁ డెవరు?

రంగా:-అర్చక తిరువేంకటాచార్యుఁడు.

మంత్రి:-పాత్ర లేదని నీతోఁ జెప్పిన దెవరు?
రంగా:-అర్చకులలో నొకఁడగు తాతాచార్యుఁడు.
మంత్రి:-ఎప్పుడు చెప్పెను? అప్పుడు నీ వెక్కడ నుంటివి?
రంగా:-సూర్యోదయా నంతరము మూఁడు గడియలకుఁ జెప్పెను. అప్పుడు నేను మాగృహమున నుంటిని.
మంత్రి:-అప్పుడు నీ వేమి చర్య దీసికొంటివి?
రంగా:-వెంటనే దేవళమునకు వెళ్లి విచారణ చేసితిని. విప్రనారాయణుని పట్ల మా కనుమానము గలుగుట వలనఁ దత్క్షణమె దివాణమునకుఁ బోయి యారక్షకాధికారి యగు దర్పసారునితోఁ జెప్పితిని.
మంత్రి:-విప్రనారాయణుని మీఁద ననుమానము గలుగుటకుఁ గారణ మేమి?
రంగా:-అతఁడు దేవదేవి యను వేశ్యాలంపటుఁ డగుటఁ బట్టి.
రాజు:-ఆ పాత్ర యిదేనా?
లేఖ:-(పాత్రను రంగాచార్యుని కందిచ్చును.)
రంగా:-(పరీక్షించి చూచి) ఇత్యాదియె.
లేఖ:-అర్చక తిరువేంకటాచార్య!

(ప్రవేశము: తిరువేంకటాచార్యుఁడు.)

మంత్రి:-కార్తిక బహుళద్వాదశి రాత్రి స్వామికిఁ బూజాదివిధుల నడపిన యర్చకుఁడవు నీవేనా?
తిరు:-అవును.

మంత్రి:-ఆరాత్రి నీవా పాత్రను గడసారి చూచిన దెప్పుడు? అప్పు డది యెక్కడ నుండెను?

తిరు:-ఆరాత్రి ప్రొద్దుగ్రుంకిన రమారమి పదిగడియ లప్పుడు స్వామికిఁ గర్పూర నీరాజనము చేయు సమయమున స్వామి సన్నిధినె యుండినది.

మంత్రి:-పిమ్మట దాని నెక్కడ నైన నుంచితివా?

తిరు:-లేదు. ఎప్పటి యట్ల దాని నక్కడనే విడిచితిని. పిదపఁ గవాటములు వేసితిమి.

మంత్రి:-పాత్రను గడసారి చూచుటకును గవాటమును వేయుటకును వ్యవధి యెంత యుండును?

తిరు:-దాదా పరగడియ.

మంత్రి:-ఆకాలమున గర్భాలయమున నుండిన వారెవరు?

తిరు:-నేనును, ముద్రకర్తగారును, స్వామిధ్యానము చేయుచు నిలుచుండిన విప్రనారాయణుఁడును.

మంత్రి:-కవాటములు వేయుసమయమునఁ గూడ విప్రనారాయణుని లోపల నుండ నిచ్చు టేల?

తిరు:-అతఁడు స్వామికి ననుదినము వనమాలికలఁ దెచ్చి యిచ్చుచుండుట చేతను, హరిభక్తుఁడని మేము నమ్మియుండుటను నతని నాలయమువారిలో నొక్కనిఁగా భావించుచున్నాము. కావున నాతని నెవ్వరు నాక్షేపించుట లేదు. నిరాటంకముగ లోనికి వచ్చుచుఁ బోవు చుండును.

రాజు:-విప్రనారాయణుని ప్రవర్తన మెట్టిది?

తిరు:-ఇటీవల నాతఁడు వేశ్యాసహవాసమున నున్నాఁడు.

రాజు:-ఆవేశ్యను నీవెప్పుడైనఁ జూచినావా?

తిరు:-చూడ లేదు.

రాజు:- పోయినపాత్ర యదియేనా?

తిరు:-(పరీక్షించి) ఇదియె.

రాజు:-ఇంకొకసాక్షి.

లేఖ:-అర్చక గండభేరుండాచార్య

(ప్రవేశము: గండభేరుండాచార్యుఁడు.)

మంత్రి:-కార్తిక బహుళ త్రయోదశి నాఁ డర్చకము చేసిన వాఁడవు నీవేనా?

గండ:-అవును నేనె.

మంత్రి:-ఆ యుదయమున, ఈ యర్ఘ్య పాత్ర యుండెనా?

గండ:-తిరువేంకటాచార్యుఁడు నాకు వస్తువులను నప్పగించు నప్పటికది యుండలేదు.

మంత్రి:-దేవదేవిని నీవు చూచి యెఱుఁగుదువా ?

గండ:-దానితో నాకేమి పని? చూచి యెఱుఁగను.

రాజు:-ఆలయపు వారిలో నెవ్వరైన నామె నెఱుఁగుదురా?

గండ:-దేవళమున కెప్పుడును రాకుండుటచే నెవ్వరు నామె నెఱుఁగ రనియె భావించుచున్నాను.

రాజు:-వేఱొకసాక్షి.

లేఖ:-ముద్రకర్త లక్ష్మణాచార్య!

(ప్రవేశము: లక్ష్మణాచార్యుఁడు.)

మంత్రి:-నీవు కార్తిక బహుళ ద్వాదశి రాత్రి వేసిన యాలయ కవాటముల ముద్రలు, ఆవరణపు గోడలు, పదిలముగా నుండెనా?

లక్ష్మ:-మరుసటి యుదయమునఁ జూచు నప్పటి కన్నియుఁ బదిలముగా నుండెను.

మంత్రి:-ఆరాత్రి యాలయ కవాటములు వేయుటకు ముందు గర్భాలయమున నుండిన వారెవ్వరు?

లక్ష్మ:-నేను, నర్చకుఁడగు తిరువేంకటాచార్యుఁడు, విప్రనారాయణుఁడు.

మంత్రి:-తిరువేంకటాచార్యుని నడవడి విషయమై నీకేమైనఁ దెలియునా?

లక్ష్మ:-అతఁడు సద్వర్తనము గలవాఁడె.

మంత్రి:-విప్రనారాయణుఁ డెట్టివాఁడు?

లక్ష్మ:-ఆఁతడు దేవదేవియను వేశ్యతో మనుచున్నాఁడు.

మంత్రి:-ఆ వేశ్యను నీవు చూచి యెఱుగుదువా?

లక్ష్మ:-ఎఱుఁగను.

మంత్రి:-అరక్షకాధికారి దర్పసారుఁడు.

(ప్రవేశము: దర్పసారుఁడు)

మంత్రి.-ఆ-య-పు హేమపాత్రము పోయినదని నీతో నెవరు చెప్పినది?

దర్ప:-ఆలయపు ధర్మకర్త యగు రంగాచార్యుడు దివాణమున నున్ననాకుఁ జెప్పెను.

మంత్రి:-ఎప్పుడు చెప్పెను?

దర్ప:-కార్తిక బహుళత్రయోదశి నాఁటి యుదయమునఁ బది గడియ లప్పుడు.

మంత్రి:-అప్పుడు నీవేమి చర్య దీసికొంటివి?

దర్ప:-విప్రనారాయణుఁడు నారామమందుఁ జూడ నారిఁ డం దుండ లేదు. కంచికే ప్రయాణమయి యుండు నని యూహించి, నున్నునాఁడు కంచికి బైలుదేఱితిని.

మంత్రి.-ఆ హేమపాత్ర మెక్కడ నెప్పుడు దొరకెను?

దర్ప:-మార్గశిర బహుళపాడ్యమి నాఁటి యుదయమున, సూర్యోదయానంతరము దాదాపు గడియ లప్పుడు, విటకంటకి గృహ మందలి యను పేటికలో దొరకెను.

మంత్రి:-అప్పు డాగృహమున నెవ్వరెవ్వ రుండిరి?

దర్ప:-విటకంటకియు నామె కొమార్తె లగు దేవదేవీమధురవాణులును బడసాలలో నుండిరి.

రాజు:-విప్రనారాయణుఁ డెందుండెను?

దర్ప:-అతఁడింటిలో నుండ లేదు. అగ్రహారామ మందలిబావిలో స్నానము చేయు చుండెను.

రాజు:-పేటిక బీగముచెవి యెవరి యొద్ద నుండెను?

దర్ప:-వేశ్యమాత యగు విటకంటకి యొద్దనే యుండెను.

రాజు:-నిందితుఁడా! కార్తిక బహుళ ద్వాదశి నాఁటి రాత్రి గర్భాలయ కవాటములు వేయుటకు నించుక పూర్వ మెక్కడ నుంటివి?

విప్ర:-స్వామి సన్నిధానముననె యుంటిని.

రాజు:-ఏమి చేయుచుంటివి?

విప్ర:-ధ్యానము చేయుచుంటిని.

రాజు:-ఈ హేమపాత్ర మెవ్వరిది?

విప్ర:-(పరీక్షించి) ఇది శ్రీరంగనాథునిది.

రాజు:-ఆనాఁటిరాత్రి దీనిని స్వామి సన్నిధిని జూచియుంటివా?

విప్ర:-చూచి యుంటిని.

రాజు:-ఆరాత్రి నీ వెక్కడ నుంటివి?

విప్ర:-తదాలయ మందలి యొక వెలి మండపమున.

రాజు:-ఆలయమును నీ వెప్పుడు విడిచితివి? విడిచి యెక్కడకుఁ బోతివి?

విప్ర:-ప్రభాతమై యుండఁ గంచికిఁ బ్రయాణమైతిని.

రాజు:-కంచికిఁ బోవ నేల?

విప్ర:-విటకంటకి నన్నుఁ బిలిపించుట చేత?

రాజు:-విటకంటకి యేల నిన్నుఁ బిలిపించెను?

విప్ర:-నాభార్య యందుండుటచేత.

రాజు:-నీ భార్య యెవరు?

విప్ర:-దేవదేవి.

రాజు:-ఆమె వేశ్యగదా?

విప్ర:-వేశ్యాగృహమునఁ బెరిగిన బ్రాహ్మణకన్య. దానినే గాంధర్వ విధిని వివాహ మాడితిని.

రాజు:-నిన్నుఁ గంచికిరాఁబిలుచుటకు వచ్చిన దెవరు? ఎప్పుడు?

విప్ర:-రంగనాఁథుఁడను బాలుఁడు. చామన చాయవాఁడు. అదే కార్తిక బహుళ ద్వాదశి రాత్రి. అరుణోదయమున కించుకపూర్వము.

రాజు:-ఆ రంగనాఁథుఁడెవరు?

విప్ర:-తాను విటకంటకి పంపిన సందేశహారుఁడని చెప్పెను.

రాజు:-ఆబాలుఁ డిప్పు డెక్కడ నున్నాఁడు?

విప్ర:-నేనెఱుఁగ.

రాజు:-వాని పరిచయము నీకుఁ గలదా?

విప్ర:-అంతకు ముందెప్పుడును నాతనిఁ జూచి యెఱుఁగ.

రాజు:-వానికెంత వయస్సుండును?

విప్ర:-పదునెనిమిది వర్షము లుండవచ్చును.

రాజు:-వాఁడెప్పుడు కంచి విడిచినదని యడిగితివా?

విప్ర:-ఆతని నెన్నియో ప్రశ్నలడుగ వలెనని యుంటిని;కాని యాతఁ డందుఁ గాల్నిలుపక మాయమాయెను.

రాజు:-ఏమీ! మాయమయ్యెనా! సరె. నీవు కంచి నెప్పుడు చేరితివి?

విప్ర:-మార్గశిర శుద్ధ త్రయోదశి రాత్రి పదిపండ్రెండు గడియలకు.

రాజు:-ఈహేమ పాత్రము విటకంటకి గృహ మెట్లు చేరెను.

విప్ర:-నేనెఱుఁగ.

రాజు:-నీవు దాని కియ్యలేదా?

విప్ర:-దేవధనము దొంగిల నేనెంతటి వాఁడను?

రాజు:- నీవు కంచి చేరిన పిదప దేవదేవిగాని విటకంటకిగాని యీపాత్ర విషయమై నీతో మాటాడలేదా?

విప్ర:-లేదు. దాని ప్రస్తావమే లేదు.

రాజు:-ఆలయ మండపములో నీవుండు నపుడును, ఆలయమును నీవు విడిచి కంచికిఁ బ్రయాణ మగునప్పుడును నిన్నుఁ జూచినవా రెవ్వరైన నున్నారా? అట్టిసాక్షు లున్నఁ జెప్పుము.

విప్ర:-సీ. చారువిభ్రమ శిలాస్తంభ ప్రకర్ణ మా
యపుడేఁ బరున్నమండపము సాక్షి,
రంగేశు గుడిలోన ఖంగుఖంగున మ్రోఁగు
కాంస్యఘంటా సముత్కరము సాక్షి,
కనుఁదోయి మిఱుమిట్లు గొనఁగఁ గాంతులనీను
బంగారు గరుడ గంబంబుసాక్షి,
భానుర భూరి కవాట సమన్విత
తపనీయ ద్వార బంధంబుసాక్షి,

గీ. అహహ! యదిసాక్షి యిదిసాక్షి యనఁగ నేల?
నిఖిలమును బొంది సర్వత్ర నిండి యుండి
యార్తులగు భక్తజనముల నరిఁ బ్రోచు
సకల శుభదాయి శ్రీరంగశాయి సాక్షి.

రాజు:-నీసాక్షులలో నేసాక్షినైనను దోడి తెచ్చెదవా?
విప్ర:-శ్రీరంగశాయినే తోడి తెచ్చెదను.

సీ. ప్రోవవే కరుణాప్రపూర్ణమతిని హిర
ణ్యకశిపు తనయుఁ బ్రహ్లాదబాలు?
రంక్షింపవె కృపాతిరంగితహృదిని వి
శ్వోత్తర ధృవపదం బొసఁగి ధృవుని?
కాపాడవే దయాకలిత హృదయమునఁ
గడు దైన్యమున నుండు కరికులేంద్రు?
మనుపవే ద్రౌపదీ మానినీమణి, మాన
భంగంబు గాకుండఁ బ్రకటమహిమ?

గీ. అట్టికరుణా నను బ్రోవు హరి ముకుంద!
యభ్యధిక కృపాపరి కంపి తాంతరంగ!
రమణఁ బాలింపవె విహంగరాట్తురంగ!
రంగ! రాగదె వైకుంఠ రంగమునకు.

రాజు:-నీసాక్షి వచ్చెనా?
విప్ర:-వచ్చినాడు రాజా!
రాజు:-రానీ చూతము.
మంత్రి:-విటకంటకీ! ఈబంగారు పాత్ర నీకెట్లు వచ్చెను?
విట:-విప్రనారాయణయ్య పంపినాఁడని యతని శిష్యుఁడు నా
కిచ్చెను.

మంత్రి:-శిష్యుఁ డెవరు?

విట:-అతని పేరు రంగనాథుఁడు.

మంత్రి:-వాని కెంత వయసుండును?

విట:-పదియాఱేండ్ల కించుక పైఁబడి యుండును.

మంత్రి:-వాఁడెక్కడ నున్నాఁడు?

విట:-నేనెఱుఁగను.

మంత్రి:-ఆబాలుఁడు విప్రనారాయణు శిష్యుఁడని నీకెట్లు తెలియును?

విట:-ఆబాలుఁడు వచ్చినప్పుడు నేనడుగఁగా నతఁడు చెప్పినదే.

మంత్రి:-ఆబాలుని మున్నెప్పుడైనఁ జూచి యెఱుఁగుదువా?

విట:-ఎప్పుడును జూచి యెఱుఁగను.

మంత్రి:-ఆబాలుఁ డీపాత్ర నీ కెప్పు డిచ్చెను?

విట:-కార్తిక బహుళ ద్వాదశి రాత్రి, రమారమి పదియాఱు గడియలకు.

మంత్రి:-అప్పుడు నీవెక్కడ నుంటివి? ఏమి చేయు చుంటివి?

విట:-కంచిలో నాగృహమున నిద్రించు చుంటిని.

రాజు:-ఏమీ! సొమ్ముపోయిన నాఁటిరాత్రియె రంగనాథుఁడను బాలుఁడు శ్రీరంగమునుండి ముప్పది యామడలదూరమున నుండు కంచికి వచ్చి పాత్రను విటకంటకి కిచ్చుట, మరల నదే రాత్రియె శ్రీరంగమునకుఁబోయి విప్రనారాయణునితో మాటాడుట! ఇది యెట్లు పొసఁగును?

మంత్రి:-అది యసంభవము.

రాజు:-ఆబాలుఁడు నీకాపాత్ర నిచ్చు నప్పుడు నీయొద్ద నెవ రుండిరి?

విట:-అప్పుడర్ధరాత్ర మగుటచే నెవ్వరు నాకడ నుండలేదు.

రాజు:-ఉదయమున నీకొామార్తెలకుఁ బాత్రను జూపితివా?

విట:-చూపలేదు.

రాజు:-విప్రనారాయణుఁడు బంగరు పాత్రను బంపినాఁడని యైన వారితోనన లేదా?

విట:-లేదు.

రాజు:-ఆవార్తను వారికేల తెలుప లేదు.

విట:-విప్రనారాయణయ్య యె వచ్చినప్పుడు వారికి దెలుపు నని తలఁచి.

రాజు:-ఆపాత్ర నింకెవరికైనఁ జూపితివా?

విట:-ఎవరికిఁ జూపలేదు.

రాజు:-విప్రనారాయణుఁడు పాత్రను బంపిన దెవరితో నైనఁ జెప్పితివా?

విట:-ప్రేమసారయ్యతో మాత్రము చెప్పితిని.

రాజు:-ఎప్పుడు చెప్పితివి?

విట:-రంగనాథుఁడను బాలుఁడు దానిని నాకిచ్చిన నాఁటికి మూఁడవ దినమున.

రాజు:-ప్రేమసారుఁడు నీయింటి కప్పుడు రాఁగత మేమి?

విట:-అతఁడు విటుఁడగుటచే నప్పుడప్పుడు వచ్చుచుండును.

రాజు:-అది దేవధన మనియుఁ బరిగ్రహింపఁ గూడదనియు నీకుఁ దెలియదా?

విట:-అది దేవధన మని నేనెఱుఁగను; విప్రనారాయణయ్య సొమ్మనియె భావించితిని.

రాజు:-ఆపాత్రమీఁద నుండు శంఖచక్రాంకిత విలాసములు నీవు చూడ లేదా?

విట:-అరువది యేండ్ల ముసలినగుట నని నాకంటి కగపడ లేదు.

రాజు:- విప్రనారాయణుఁడు నీయింటికి యెప్పుడు వచ్చెను?

విట:- మార్గశిర శుద్ధత్రయోదశి నాఁటి రాత్రి.

రాజు:- ప్రేమసారుఁడు.

లేఖ:- ప్రేమసారుఁడు!

(ప్రవేశము: ప్రేమసారుఁడు.)

మంత్రి:- నీ దేయూరు?

ప్రేమ:- మధుర.

మంత్రి:- నీవు కంచిలో నుండఁ గారణమేమి?

ప్రేమ:- ఊరకే కొన్నివారములుగా నిక్కడనే యున్నాను.

మంత్రి:- ఆ బంగారు పాత్రను విటకంటకి నీ వెప్పుడుచూపితివి?

ప్రేమ:- ఆహా నాకు దానిని చూపనే లేదు. నేను దాని నెప్పుడును జూడలేదు.

మంత్రి:- పోనీ, విటకంటకి యాపాత్రవిషయమై నీతో నేమైనఁ జెప్పెనా?

ప్రేమ:- బంగారపు టష్ణ్యపాత్రము నొకదానిని విప్రనారాయణుఁడు తనకుఁ బంపినట్లు మాత్రము నాతోఁ జెప్పెను.

మంత్రి:- ఎప్పుడు చెప్పెను?

ప్రేమ:- మార్గశిర శుద్ధపాడ్యమి యైయుండును.

రాజు:- ఎవరితోఁ బంపినట్లు చెప్పెను?

ప్రేమ:- రంగనాథుఁడను బాలునితో.

రాజు:- ఆబాలుని నీ వెఱుఁగుదువా?

ప్రేమ:- నే నెఱుఁగను.

రాజు:-సరె; దేవదేవీ! నీవు విప్రనారాయణున కేమి కావలెను?

దేవ:- నే నాతని ధర్మపత్నిని.

రాజు:- విటకంటకి నీ కేమి కావలెను?

దేవ:- ఆమె నా పెంపుడు తల్లి.

రాజు:- నీ కన్నతల్లి యెవరు?

దేవ:- ఒకబ్రాహ్మణి. ఆమె పేరు నే నెఱుఁగ.

రాజు:- నీ నివాస మెక్కడ?

దేవ:- శ్రీరంగమందలి యారామమున.

రాజు:- నీవు కంచి కెప్పుడు వచ్చితివి?

దేవ:- ఆశ్వయుజ మాసాంతమునఁ గంచికిఁ జేరఁబడితిని.

రాజు: ఈ బంగరు పాత్రను నీ వెఱుఁగుదువా?

దేవ:-నే నింతదాఁకఁ జూచి యెఱుఁగను.

రాజు:- విటకంటకి నీకుఁ జూపలేదా?

దేవ:- లేదు.

రాజు:- విప్రనారాయణుఁడు బంగరుపాత్రను బంపినట్లు విట కంటకి నీతోఁ జెప్పలేదా?

దేవ:- నాతో నాప్రస్తావమే చేయలేదు.

రాజు:- విప్రనారాయణుఁడు కంచి కెప్పుడు వచ్చెను?

దేవ:- మార్గశిరశుద్ధత్రయోదశి నాఁటి రాత్రి.

రాజు:- తాను బంగారు పాత్రను నీకొఱకుఁ బంపినట్లు నీతో నెప్పుడు చెప్పెను?

దేవ:- బంగారు పాత్రమాటయే లేదు. ఆవిషయమై నాతో నెవ్వరును ననలేదు.

రాజు:- విప్రనారాయణుని శిష్యుఁ డగు రంగనాథుఁ డను బాలుని నీ వెఱుంగుదువా?

దేవ:- నే నెఱుఁగను. నాకు దెలిసినంతవఱ కాతనికి శిష్యులే లేరు.

రాజు:- సరె...నిందితుఁడా! నీసాక్షి వచ్చెనా?

విప్ర:- వచ్చు చున్నను.

రాజు:- లేనిపోని సాక్షులం గోరిన నేమిప్రయోజనము? వేశ్యను మియు నడువలేక భగవంతుని సాక్ష్యముం గోరితివి. ఇంక విమర్శన ఫలమును వ్రాసెదఁగాక. (వ్రాయమొదలి డును)

దేవ:-హా! రంగా! రంగ రంగా!

విప్ర:- (దండకము.)

శ్రీమానినీ మానసాంభోజమిత్రా! పినీలాంభ్రభ గాత్రా! సరోజాతనేత్రా! వశిష్ఠాది సన్మౌని సంఘాత సంస్తూయమానాంచి తోదార చారిత్ర! పాపౌఘవల్లీ లవిత్రా! భవోదన్వ దుత్తార సద్యానపాత్రా! కృపాపూర్ణ! హస్తీంద్ర ప్రహ్లాద రుక్మాంగ దోత్తాన పా దాంబరీషాది భక్తావ నోపాయ పారీణ! నారాయణా! భక్తనాగాయణాద్య మానాంఘ్రి రాజీవ! దేవాదేవ! చిత్రప్రభావా! సమస్త ప్రపంచంబు లందుండు జీవాళిలో నిండి యుప్పారదీవేకదా? యీ యసంఖ్యావకాశంబులో లెక్కకున్ మిక్కుటంబైన లోకంబులన్ సృష్టి గావించి రక్షింతు వీవేగదా? రంగ! నీగాయమేయు క్రియాశక్తిచేఁ గాదె బ్రహ్మాండ సందోహ మెల్లన్ విచిత్రంబుగా నైజమార్గంబులందే పరిభ్రాంతి నొందంగఁ జాలున్; తృణాబ్జాదిగాఁ గల్గు నల్పంబులౌ వస్తువుల్ గూడ నీయాజ్ఞ లేకుండ నే యుద్భవం బందగా లేవు; లేశంబునున్ రక్షణం బొందఁగా లేవు; నాశంబునుం బొందఁగా లేవు; నీశక్తి యెన్నంగ నత్యద్భుతంబై యచింత్యంబునై యుండు; నోదీన మందార! గోవర్ధనోద్ధార! వేదాంత సారార్థ హర్మ్యాగ్ర సంచార! సర్వే

శ్వరా! రార; నేనిప్పుడే దుర్గతిం బొంద నున్నానో, యే యాపదం బొంద నున్నానో; శుద్ధాంత రంగంబుతో నీకుఁ బుష్పాది దామంబు లర్పింతు నేనింక భవద్దివ్య పాదార విందంబు లేవేళ సద్భక్తి సేవింతు నేనింక గడుం బ్రీతి నే తెంచి యిరానింద నేఁబొంద కుండంగఁ బోకార్చి రక్షింపవే రంగ! కాపాడవే రంగ! పాలింపవే రంగ! శ్రీరంగ! రంగా! నమస్తే నమస్తే నమః.

దేవ:- ఉ. నాదువిభుం డకల్పష గు
ణప్రక రాన్వితుఁడయ్యె నేని, ని
త్యోదయ పుష్పపల్లవ స
ముత్కరనిర్మిత మాలికాళి న
త్యాదరబుద్ధి నీకయి స
మర్పణసేయుఁగఁ గూర్తు మేని, సం
పాదిత పుణ్యశీల గుణ
బద్ధనునై వచింతు నేని, రం
గా! దరిఁ జేర్పవే వరద!
కావవె దీనుల మమ్ముఁబ్రోవవే.

రాజు:-(లేచి న్యాయ విమర్శనము జదువును.)

అర్చకుల యొక్కయు, ముద్రకర్త ధర్మకర్తల యొక్క-
యు, అరక్షకాధి కారియొక్కయు, వాఙ్మూలములఁ బట్టిచూడ
శ్రీరంగేశు నాలయము నందుండు కాంచనపు టర్ఘ్యపాత్ర
ము కార్తిక బహుళ ద్వాదశి నాఁటి రాత్రియె ముచ్చిలఁ
బడిన దనుట వాస్తవము. తత్కాలమున గర్భాలయమున
నుండినవారు విప్రనారాయణుఁడు, అర్చక తిరువేంకటాచా
ర్యుఁడు ముద్రకర్త లక్ష్మణాచార్యుఁడు నను మువ్వురు. వీరే
నిందితులు. ముచ్చిలఁ బడిన పాత్రము విటకంటకి గృహ
మున నామె పేటికలో దొరకుటంబట్టియు, విటకంటకి పు
త్రిక యగు దేవదేవికిని ప్రథమ నిందితుఁ డగు విప్రనారా
యణునకును, బరస్పరానురాగ సంబంధ ముండుటంబట్టియు,
విప్రనారాయణుడే తచ్చౌర్యము చేసియుండుట విదితము.
అర్చక తిరువేంకటాచార్యుఁడును, ముద్రకర్త లక్ష్మణాచా
ర్యుడుఁను, విటకంటకీ దేవదేవీ మధురవాణుల పరిచయము
లేశమాత్రము లేనివారగుటచే, వారిమూలమునఁ దత్కాం
చన పాత్రము విటకంటకి గృహము చేరియుండు ననుట
పొసఁగ నేరదు.

ముచ్చిమి చేయఁబడిన నాఁటిరాత్రియె రంగనాథుఁ
డను బాలుఁడు దాను విప్రనారాయణుని శిష్యుఁడనుచు
హేమ పాత్రమునుదెచ్చి తనకొసంగె నని విటకంటకియు,
విటకంటకి సందేశహారుఁడై వచ్చి తనతోఁ బల్కెనని విప్ర
నారాయణుఁడును నుడివిరి. శ్రీరంగము నుండి కాంచీపుర

మునకును, మరలఁ గాంచీపురమునుండి శ్రీరంగమునకును, రమారమి యిరువది యామడల దూరము పది పదియా ఱు గడియల కాలములోఁ బ్రయాణము చేయుట యెట్టి వారికిని నసాధ్యము; ఎంత జవనాశ్వ మేని యాయత్యల్ప కాలములో నంతదూరము ప్రయాణము సేయ నేరదు. దీనింబట్టి చూడ విప్రనారాయణుని శిష్యుఁడని పిటకంటకి యు, పిటకంటకీ సందేశ హారుఁడని విప్రనారాయణుఁ డును నుడువు నట్టి రంగనాథుఁడను బాలుఁడు కేవలము కల్పిత పాత్రము. దేవదేవియె యాబాలుని దా నెఱుఁ గనని చెప్పుట యీ నిశ్చితమును బలపఱచుచున్నది. విప్ర నారాయణుఁడు రంగనాథుఁడను బాలునితో హేమపాత్ర మును బంపెనని ప్రముచ్చిమి జరిగిన మూఁడవనాఁడె విట కంటకి తనతో నుడివినట్లు విటుఁడగు ప్రేమసారుఁ డిచ్చిన సాక్ష్యము, విశ్వాస నీయము గాదు. విప్రనారాయణుఁడు భక్తాగ్రేసరుఁడనియు, దైవసాహాయ్య సంపన్నుఁడనియు, సభవా రనుకొన వలెనని ప్రతివాదులు బన్నుఁగడ పన్ని రంగనాథుఁడను పాత్రమును గల్పించినవారు.

కార్తికబహుళ ద్వాదశి నాఁటిరాత్రి యాలయము నందలి యర్చక ప్రభృతు లేమరి యుండు తఱి, స్వామి సన్నిధాన మునఁ గపటధ్యానమున నుండు ప్రథమ నిందితుఁడగు విప్ర నారాయణునకు దేవధన మగు హేమపాత్రమును విటకం టకి కొసంగుటకై దొంగిలి, యెవ్వరు లేని గుడిమండప

ముననుఁ బరుండి, ప్రభాతము కాఁగనే యేఁటికి వెలియుకుంట నేరుగఁ గాంచీపురికిఁ బ్రయాణ మయ్యెను. నిందితుఁ డగు విప్రనారాయణుఁడు కాంచీపురమందలి విటకంటకి గృహము చేరినప్పుడె తత్పాత్రమును విటకంటకి కిచ్చియుండుట రూఢ మగుచున్నది. కావునఁ బ్రథమ నిందితుఁడగు విప్రనారాయణుఁడె యపరాధి. ఇతరనిందితు లనపరాధులు. భక్తుఁడని పేరు మోసిన విప్రనారాయణుఁడే వేశ్యాలంపటుఁడై దేవధనమును దస్కరించుటంజేసి నేరము ఘోర మగుచున్నది. కాఁబట్టి హస్తఖండన —

(లోపల ధ్వని) ఆఁగుము, ఆఁగుము. చోళరాజేంద్రా!

రాజు:- ఆశ్చర్యము! ఆశ్చర్యము!

విప్ర:- తండ్రీ! వచ్చితివా! నా మొఱాలకించితివా!

(ప్రవేశము: శ్రీరంగేశుఁడు)

శ్రీరంగ:- ఆఁగు మాఁగుము. చోళరాజేంద్రా! శిక్ష విధింపవలదు. విప్రనారాయణుఁడు మదీయ భక్తుఁడు. హేమపాత్రమును దెచ్చి విటకంటకి కిచ్చినది నేనే. అదే రాత్రి యారామమంటపమున నుండిన విప్రనారాయణునకుఁ గాంచీపురికిఁ బొమ్మని విటకంటకి సందేశమును జెప్పినదియు నేనే. నిందితుఁడగు విప్రనారాయణుఁడు నిరపరాధి.

విప్ర:- దీనవత్సలా! కృపామూర్తీ! నానిందఁ బోకార్చితివా!

రాజు:- శ్రీరంగనిలయా! నిరపరాధిని దండ్యునిగాఁ దలఁచి శిక్షవిధింప నున్న నాకు సత్యమును దెలియఁజేసి పాపము నుండి నన్నును, కష్టములనుండి భక్తవరుని, రక్షించి మాకు మహోపకారము చేసితివి.

దేవా! ధర్మమని యధర్మమును జేయ నెంచిన యజ్ఞుఁడను. భవదీయభక్తవరునికి బంధములు వేయించి నీయెడ మహాపచారమును జేసితిని. ఇదె బంధములఁ దొలఁగించు వాఁడ. క్షమింపుము. (విప్రనారాయణుని బంధము లూడ్చును.)

విప్ర:- ఈశృంఖలలు నాకు మహోపకారము చేసినవి. ఇవి నాదేహమును బంధించినను, నాచిత్తమున కత్యంతచైతన్య మొనవించి శ్రీవిష్ణుమూర్తిని సన్నిహితుఁ జేసినవి.

దీనజనమందార! కృపాపూర! నీ కృపార్ద్రదృష్టి నాపయిఁ బ్రసరింపఁజేసి నాయంతరంగ మెంత చల్లనయ్యె!

శ్రీరంగ:- దేవదేవియు విప్రనారాయణుఁడును గతజన్మంబున భార్యాభర్తలై యుండిరి. భూజీవకుల సంజాత యయ్యుఁ గించిత్ పూర్వజన్మ దుష్కర్మవిపాకమున దేవదేవి కొంత కాలము వేశ్యాగృహమున నుండవలసె. కాని మదీయకైంకర్యము చేసిన, విప్రనారాయణుని శుశ్రూషాసాహచర్యములు చేసిన, నీమె సత్స్వభావయై పునతయై యీజన్మమునందున విప్రనారాయణు పూర్ణానురాగమును సంపాదింపఁ గలిగినది.

దేవ:-దేవా! నీపలుకులు మామక చిత్తజృంభణ మొనరించు చున్నవి.

విప్ర:-దేవా! శ్రీరంగా! మా పూర్వజన్మ వృత్తాంతంబులు దెలుపు భవదీయవచనామృతవృష్టిచే నాచిత్తపంకజంబు దుశ్శంకాపంక ప్రక్షాళితంబై నిర్మలం బయ్యె.

శ్రీరంగ:-విప్రనారాయణా!

విప్ర:-తండ్రీ! ఏమి యాజ్ఞ!

శ్రీరంగ:-నీవు విద్యాపరిణతుండవు. ప్రాప్తయౌవనుండవు. బుద్ధి రూప శీల లక్షణ సంపన్నుండవు. కావున గృహస్థాశ్రమ స్వీకార యోగ్యుండ వైతివి.

వత్సా! గృహస్థాశ్రమము తక్కిన యాశ్రమంబులకుం గ్రిందైనదిగాదు. గృహస్థుండు సకలకర్త. పంగ్వంధబధిరభిక్షుకాదులకుం గామధేను సదృశుండు.

గార్హస్థ్యము వృక్షము వంటిది. ధర్మము, అర్థము, కామము, మోక్షము, అనునవె దానికి మూలము, పత్రము, పుష్పము, ఫలము. ఆరామపాలకుండు ఫలోత్పాదనమునకై వృక్షమును రక్షించునట్లు, గృహమేధి మోక్షసంపాదనమునకై గృహస్థధర్మమును బరిపాలింప వలయును.

మఱియు సంసారము దుర్గము వంటిది. దుర్గములో నుండియె యరివర్గముతోఁ బోరుట యనపాయకరము,

సుకరము. పరిత్యక్తసంసారులై పోరువాని కాపదలు నొందు.

కాఁబట్టి గృహస్థధర్మమును యథావిధి నడుపుము. నీకు నిశ్శ్రేయ సంబగు.

విప్ర:-తండ్రీ! నీయాజ్ఞను శిరసావహించి చేయువాఁడను. (వంగి నమస్కరించును.)

(శ్రీరంగేశుఁ డంతర్ధాన మగును.)

శ్రీరంగా! ఎందుఁ బోతివి? హారంగా! రంగనాథా! రంగధామా! (అని యాకసమువంకఁ జూచుచుండును.)

రాజు:-భక్తాగ్రగణ్యా! నీపుణ్యవశమున శ్రీరంగేశుఁడు మాకును సాక్షాత్కార మయ్యె. మేమును ధన్యులమైతిమి. విప్రనారాయణా! నీమాహాత్మ్య మెఱుంగలేక నిన్నన్నో సిలుగులఁ బెట్టితిని. అందులకుఁ బశ్చాత్తాపము నొందుచున్నాను. దయాళుహృదయా! నన్ను క్షమించి కృపామతిఁ జూడుము. (నమస్కరించును.)

విప్ర:-చోళరాజేంద్రా! నీధర్మమును నీవు నెరవేర్చుచుంటివి గాక, నీవేమి తప్పు చేసితివి? లెమ్ము. (లేవనెత్తును.)

రాజు:-అమ్మా! దేవదేవీ! విప్రనారాయణా! మీరు దాంపత్య సుఖ మనుభవించుచుఁ జిరకాలము మనియుందురుగాక. (దేవదేవీకరమును విప్రనారాయణుని కరమందుంచును.)

దేవ-విప్ర:-మహాభాగ్యము.

రాజు:-అమాత్యవరా! అనపరాధికి హస్తఖండన కఠోరశిక్ష విధింప నుంటిని గదా. ఎంత ప్రమాదము జరుగ నుండెను!

మంత్రి:-మానవుఁ డల్పజ్ఞుఁడు గావుననే యిట్టి విపర్యయము లప్పుడప్పుడు సంభవించుట.

ప్రేమ:-భక్తురాలగు దేవదేవిని బాధించి నేనెంతటి మహాపాతకి నైతిని! ఇదివఱలో సంకల్పించినట్లు నే నేపడఁతిని బరిగ్రహించక, బ్రహ్మచర్యముననే నాయాయుష్కాల మంతయుఁ గడపెద. మఱియు మన దేశమునుండి యీవేశ్యావృత్తిని దొలగించుటకై నాధనమును జీవితమును నంతయు ధారవోసెద. ఈ ప్రాయశ్చిత్తములచేతనైనను నేఁజేసిన మహాపాతకము గొంతవఱకైన సమయునేమో.

మధు:-ఇంక నే నేపురుషుని బరిగ్రహింపక నాప్రతిన చొప్పున నే మనియెదఁ గాక. నికృష్టమును గర్హణీయమును పాపప్రదమును నగు వేశ్యావృత్తిని మనదేశమున సమయించుటకై పాటుపడియెదఁగాక. అన్నా! ప్రేమసారా! నీ పవిత్రమైన పూనికకు నేనును దోడ్పడియెద. నాసేవ పరిగ్రహించుము.

ప్రేమ:-సంతోషముగఁ బరిగ్రహించెద.

పిట:-అయ్యో! బ్రాహ్మణ శిశువులఁగాని వేశ్యావృత్తిని జొను పు పాపాత్మురాలను. నాకేమి ప్రాయశ్చిత్తమున్నది? దేవ దేవీ మధురవాణులారా! ఇదే వినుఁడు. నా చర స్థిరా స్తుల విలువ పదిలక్షలుండును. ముసలిదాన నగుట నా యాస్తిలో నొక్కపాలును మాత్రము నే నుంచుకొని, తక్కిన రెండు పాళ్ళను మీకిచ్చుచున్నాను. అది మీరు సంపాదించినదే కదా.

దేవ-మధు:-అమ్మా! చాలసంతోషము. దానిని మేము స్వీక రించు చున్నాము.

మధు:-చెల్లెలా! ఈ యాస్తితో మన మేమి చేయుదము?

దేవ:-అక్కా! దీనిని వేశ్యావృత్తి పరిహారము కొఱకు విని యోగించుటకై ప్రేమసారున కొసంగుదము. కాని నా యాభరణములను మాత్రము శ్రీరంగేశునకు సమర్పింప నెంచిన దానను.

మధు:-మంచి మాట చెప్పితివి. అట్లు చేయుట వలన మన యాస్తి సద్వినియోగ మగును.

అన్నా! ప్రేమసారా! మాతల్లి మా కొసఁగిన యా స్తిలో దేవదేవి యాభరణంబులు తప్ప మిగిలిన దాని నంతయు వేశ్యావృత్తిని మన దేశము నుండి తొలఁగింప వినియోగించుటకై నీకు మేము దానము చేయుచున్నాము.

దేవ:-దానిని నీవు ప్రతిగ్రహింప వలయునని వేడుచున్నాము.

ప్రేమ:- సోదరీమణులారా! మీరు నియోగించు నట్లు మీ యాస్తిని సద్వినియోగము చేయుటకై నేను దానిని సంతోషముతో బ్రతిగ్రహించుచున్నాను.

విప్ర:- జీవ సఖీ! మన మూ రామునకుఁ బోయి కృషి చేసి మన పరిశ్రమ ఫలమునే మన మనుభవించుచు, సత్పాత్రులకు దానము చేయుచు, స్వార్థము మాని మానవసేవ చేయుచు, శ్రీరంగేశు కైంకర్యము యథారీతిఁ గావించుచు, సంసార యాత్రను సుఖముగాఁ జేయుదము.

దేవ:- నాథా! అట్లే చేయుదము. అట్లుచేయుటవలన నామనస్సునకు మహానందము గలుగును. ఏమినా భాగ్యము! నాపడిన ప్రయాసమంతయు సఫలమయ్యె.

చ. పతినయు మైతి భక్తవరుఁ,
బ్రాణము ప్రాణము నైన మత్సహో
దరి పరిశుద్ధచిత్తయయి
ధన్యతఁ గాంచెను, గన్నులారఁగా
హరిసుఖదర్శనం బనియు
నబ్బెఁ, బవిత్రత నూవహిల్లె, నా
దురితము లెల్ల వీడెఁ, బరి
తోషము నందెను స్వాంత మెంతయున్

శ్రీరంగనాథా! నీవెంతో యనుగ్రహించితివి. ఈభరతవాక్యము కూడ సిద్ధింపఁ జేయుము.

సీ. వేశ్యాళి తమ నీచవృత్తిని మాని వి
    వాహిత లయి వృద్ధిఁ బరఁగుఁ గాక!
నిఖిలోర్విజనులకు నీరజాక్షుని మీఁది
    భక్తితాత్పర్యంబు వఱలుఁ గాక!
భూజనయిత్రి తా భూరిసస్యాఢ్యయై
    తన ప్రజావళిఁ బ్రేమ మనుచుఁ గాక!
శాశ్వతం బగులోక శాంత్యుపలబ్ధికై
    రాష్ట్రాధిపులపూన్కి ప్రబలుఁ గాక!

గీ. భారతావని యఖిలసౌభాగ్యగరిమ
మించి యత్యున్నతపదంబుఁ గాంచుఁగాక!
సకల నయమూర్తి శ్రీజార్జి చక్రవర్తి
నిజప్రజావాంఛలం దీర్చి నెగడుఁగాక!

(అందఱు నిష్క్రమింతురు.)

సంపూర్ణము.

---

[illegible] ముద్రాక్షరశాలయందు ముద్రితము.